ప్రపంచ తెలుగు మహాసభల ప్రచురణ

# ఆంధ్ర కవయిత్రులు



రచయిత్రి :

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
సైఫాబాదు, హైదరాబాదు-500 004

# ముందు మాట

ఎన్నో ఏళ్లుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వ సమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగు వారి ప్రతినిధులందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్దలందరూ కన్న కలలు ఫలిస్తున్న శుభ సమయమిది. రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరుపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలంనుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారత దేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడేవారి తరువాతి స్థానం తెలుగువారిదే. బౌద్ధ పూర్వయుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనా యుగం వరకూ తెలుగువారు పెద్ద ఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్లడం జరిగింది. అట్లా వెళ్లిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళ వించి, వాటిని సుసంపన్నం చేస్తున్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశ పర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయ వలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోడానికి, తద్వారా వివిధ చైతన్య స్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోడానికి ఈ మహాసభలు దోహదకారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు అర్ధ్రమైన భావసమైక్యతకు ప్రాతిపదికలై తెలుగు జాతిని సమైక్యం చేయగలవనీ, ఆ విధంగా జాతీయ అభ్యు దయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12 తేదీన తెలుగు ఉగాది రోజున ప్రారంభమై ఒక వారం రోజులపాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కో వంటి అంతర్జాతీయ సంస్థలనుంచి

విచ్చేసిన ప్రముఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు. ఈ మహాసభల సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగు వారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని (మ్యూజియంను) స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజభూతమవుతుంది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమములు వారం రోజులపాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘన విజయాలను విశదంచేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకు వచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను, తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

**జలగం వెంగళరావు**

అధ్యక్షులు

**ప్రపంచ తెలుగు మహాసభలు**

# ప రి చ య ము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగు దేశపు నలుచెరగుల పరిమితముచేయు సంకల్పముతో 1975వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది. అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింప జేయుట యేగాక, ప్రపంచములోని వివిధ దేశాలలో నివసించు చున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒక చోట సమావేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగునటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందుకు ఒక ఆహ్వాన సంఘము ఏర్పాటయినది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళ రావు గారు ఆ సంఘమునకు అధ్యక్షులు, విద్యాశాఖామంత్రి మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు దాని కార్యనిర్వాహ కాధ్యక్షులు, అర్థిక మంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డి గారు ఆర్థిక, సంస్థా కార్యక్రమాల సమన్వయ సంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చు వారికి తెలుగుజాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్ర భాషా, సాహిత్య, కళా చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వహణకై 44 మంది సభ్యులుకల ఒక విద్వత్ సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డి గారి అధ్యక్షతన నియమించినది. ఆ విద్వత్ సంఘము ఆ లఘు గ్రంథముల వస్తువుల నిర్దేశించి వాని రచనకై ఆయా రంగములందు పేరుగనిన ప్రముఖు

లను రచయితలుగ యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య, చారిత్రక విషయములకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప వలసినదిగ ప్రపంచ తెలుగు మహాసభాకార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలతకొరకై కృషిచేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమి సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ **ఆంధ్ర కవయిత్రులు**, రచించిన **శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ** గారు ఆంధ్ర పాఠకలోకమునకు సుపరిచితులు. వారికి మేము కృతజ్ఞతాబద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన దక్షిణ భారత ప్రెస్ వారికి మా కృతజ్ఞతలు.

హైదరాబాదు
21-3-75

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

# ఆంధ్ర కవయిత్రులు

## తొలి తరము – ప్రాచీనాంధ్ర వాఙ్మయము

భారతీయ దేశభాషల యందు ఆంధ్రభాష ఒకటి. 'Italian of the East' అనియు "దేశ భాషలందు తెలుగు లెస్స" అనియు కీర్తింపబడిన ఈ మధురాంధ్రభాష దక్షిణ భారతము నందలి సుమారు నాల్గుకోట్ల ఆంధ్ర దేశీయుల భాష ! మాతృభాష ! !

జగత్ప్రసిద్ధి చెందిన పూజ్యులు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, పోతన, శ్రీనాథ, శ్రీకృష్ణదేవరాయ, పెద్దన, వేమనాది మహాకవుల యొక్కయు, చానమ్మ, తిమ్మక్క, మొల్ల, మోహనాంగి, గంగాదేవి, మధురవాణి, రంగాజమ్మ. రామభద్రాంబ, నాచి, ముద్దుపళని, వెంగమాంబ సుందరీమణి, జ్ఞానమాంబ మున్నగు మహాకవయిత్రుల యొక్కయు, అన్నమయ్య. క్షేత్రయ్య. రామదాసు, త్యాగయ్య మున్నగు గొప్ప వాగ్గేయ కారకుల యొక్కయు మహనీయ రచనలచే ఆంధ్రభారతి విశ్వ విఖ్యాతి నార్జించియున్నది.

కోమలమగు పదవిన్యాసముచే సహజముగానే మధురమైన తెలుగు భాషా వాఙ్మయ శోభను తమ తమ మంజుల రచనచే ద్విగుణీ కృతముగా అతిశయింపజేసిన ఆంధ్ర రమణుల రమణీయ సాహితీ పరిశ్రమము ఆంధ్ర వాఙ్మయమునకు గర్వకారణమే గాక యావద్భారత వాఙ్మయ చరిత్రకే అలంకార ప్రాయమైనది.

పదమూడవ శతాబ్దమున ప్రవర్తిల్లిన వీరసతి చానమ్మ నుండి నేటి మహిళాభ్యుదయ వాఙ్మయము వరకు సమగ్రకృషి సలుపగా సుమారు నాలుగువందల కవయిత్రులు రచయిత్రులు గల ఈ మహదాంధ్ర మహిళా వాఙ్మయ చరిత్ర యందు ప్రధానముగా 19 శతాబ్ది అంత్య భాగము వరకు ఆధునికముగా గేయ,

పద్య రచన సల్పుచు తమ తమ రచనా పరిశ్రమ్రియచే ఆంధ్ర సాహిత్యమున కితోఽధిక సౌందర్యమును సమకూర్చిన ఆంధ్ర కవయిత్రుల చరిత్ర ప్రస్తుత మీ వ్యాసమున పొందుపరుపబడుచున్నది.

## ప్రాచీనాంధ్ర కవయిత్రులు

### చానమ్మ

మధురాతి మధురమగు ఆంధ్ర సారస్వత వాహినిని కమ్మని కవితా మరందములు చిందించిన కవయిత్రులు పూచిన పొందమ్ములై పరిమళించు చున్నారు.

అందు ఆంధ్రభారతీ సంసద్భవమున కవయిత్రీ ప్రాతినిధ్యము నంగీక రించిన ప్రథమస్థానిని: చానమ్మ!

ఆంధ్ర సాహిత్య ప్రశస్తికి మూలస్తంభమనదగిన కవిబ్రహ్మ తిక్కనార్యుని వదినగారును "ఇంద బ్రాహ్మ్యం, ఇదం క్షాత్ర"మ్మని ఆచరణలో నిరూపించిన ఖడ్గతిక్కన భార్యయునైన చానమ్మ, తన భర్త ఖడ్గతిక్కన పరాజితుడై 'పగ అకు వెన్నిచ్చి' రణరంగము నుండి యింటికి తిరిగిరాగా స్త్రీలకు పెట్టినట్లు బిందెపై పసుపు ముద్దను పెట్టి మంచము చాటుచేసి స్నానమునకు నీళ్ళు పెట్టె నట! అదిచూచి ఖడ్గతిక్కన బాధపడుచుండగా:

"పగఅకు వెన్నిచ్చినచో
నగరే మన మగతనంపు నాయకు లెందున్
ముగురాడువార మైతిమి
వగపేలా జలకమాడ వచ్చినచోటన్"

అని ఆశువుగా పల్కి భర్తకు వీరరస ప్రోత్సాహ పూర్వకమగు కవితోపచార మును చెల్లించినది. ఖడ్గతిక్కన ఈ పరాభవమునకే బాధపడుచుండగా తల్లి ప్రోలమ భోజన సమయమున విరిగిన పాలను వడ్డించిన 'అతడిది ఏమిః' యను సర్థముతో చూడగా—

"అసదృశముగ నరి వీరుల
పస మీరగ గెలువలేక పందక్రియస్కి
వసి చెచి విరిగి వచ్చిన
పసులున్ విరిగినవి తిక్క పాలున్ విరిగెన్"

అని శూలములవంటి పలుకులలో ప్రత్యుత్తరమిడెను. భార్య, తల్లి యొసర్చిన ఈ వీరప్రబోధముచే ఉద్రిక్తుడై ఖడ్గతిక్కన తిరిగి యుద్ధభూమికి వెడలి విజయియై ప్రాణముల విడచెను. స్వదేశ స్వాతంత్ర్యమునకు తమ ప్రభువుకును సంఘటించిన ఘోరవిపత్తును తొలగించుటకై నిజమాంగల్యమునే సరుకు సేయక వీరకాంత చానమ్మయు, స్వదేశ స్వాతంత్ర్య రక్షణార్థము కడుపు తీపి సైతము త్రోసిపుచ్చిన వీరమాత ప్రోలమ్మయు పలికిన పై పద్యముల యందలి భావోద్దీప్తి, అకృత్రిమమగు స్వాతంత్ర్య పిపాస, వ్యర్థపదములు లేకుండా హృదయమునకు సూటిగా తగులునట్లు చెప్పగల కవితా శిల్పమును గమనింపదగినవి. ఇట్టి అకలుషితాంధ్ర యువతీ వీర రసోల్బణము, మాననీయాంధ్ర మహిళా సాహిత్య స్రవంతికి పుట్టువగుటచే నిజముగా ఈ సాహిత్యము ధన్యమైనది.

## గంగాదేవి సంస్కృత మహాకవయిత్రి మధురా విజయము

వీర విక్రమాటోపముననను, సార సామర్థ్యముననను పరమశివున కెనయైన వీరకంపరాయల పట్టమహిషి గంగాదేవి గీర్వాణ భాషయందు "మధురా విజయ" మను మహాకావ్యమును రచించెను. కంపరాయలు విద్యానగర సామ్రాజ్య ప్రతిష్ఠాపకులగు సంగవంశ ప్రభువులలో మూడవవాడు. 1370 ప్రాంతమున విద్యానగరము నేలిన ఈ మహావీరుడు ఆనాడు దక్షిణ భారత దేశమున చోళ, పాండ్య దేశములయందు పెనగా ఉవ్వెత్తిల్లుచున్న మహమ్మదీయ దండయాత్రల నెదుర్కొనుటకై ఆంధ్ర సేనావాహినిని వెంటనిడుకొని యేగి మహమ్మదీయులతో యుద్ధము నొనర్చి జయమంది తిరిగి వచ్చిన పరమసాహసి. భర్తకు తగిన భార్యయై కదనశిల్ప పారంగతత్వమేగాక, కవితా శిల్ప ప్రాభవమును కల్గి గంగాదేవి తన భర్త విజయగాథనే "మధురా విజయమ్" అను పేరున సంస్కృతమున మహాకావ్యముగ రచించెను. "వీరకంపరాయ చరితమ్" అని దీనికి నామాంతరము కలదు. అందు కావ్యాదిని సంస్కృత కవిస్తుతియు, వెనుక —

"తిక్క యజ్వ కవేస్సూక్తిః కౌముదీవ కలానిధేః
సతృష్ణైః కవిభిస్స్వైరం చకోరై రివ సేవ్యతే."

ఈ విధముగా ఆంధ్ర కవిస్తుతి నీమె నూతన విధానమున నొనర్చెను.

సుకుమార భావుకతకు, ధారళమగు శైలికి, సున్నితములగు ఉపమల కును నీమె పెట్టినది పేరు.

ఈమె తన కవిత్వమునకు కవికుల గురుడగు కాళిదాసును ఆదర్శముగ గైకొనెను. అయినను కొన్ని తావులలో ఉపమలను చిత్రించుటలో కాళిదాసును కూడా మించెను. కాళిదాసుయొక్క, గంగాదేవి యొక్క ఈ క్రింది శ్లోకములను పరికింపుడు :

కాళిదాసు : ససేనాం మహతీం కర్షన్ పూర్వసాగర గామినీమ్
భభౌ హరజటాభ్రష్టాం, గంగామివ భగీరథః

హరజటా జూటము నుండి భ్రష్టమైన గంగను భగీరథుడు కొనిపోయినట్లు, పూర్వసాగర గామినియగు మహాసేనను గొంపోవుచు నా రఘుమహారాజు ప్రకాశించెను.

గంగాదేవి : నసయన్ మహతీం సేనాం. వ్యరుచ ద్వీర కుంజరః
పయోదమాలా మాకర్షన్ పౌరస్త్య ఇవ మారుతః

వీరకుంజరుడైన కంప భూధవుడు మేఘమాలను గొనిపోవు తూర్పు పయ్యెరవలె గొప్పసేనను వెంటనిడుకొనిపోయెను.

లాలిత్యము, స్త్రీ సహజ సౌకుమార్యము కల అట్టి వర్ణనలు ఈ కావ్య మున మనకు లభించును.

## తొలి తెలుగు కావ్య కవయిత్రి

**తాళ్ళపాక తిమ్మక్క— సుభద్రా కళ్యాణము :**

సుభద్రా కళ్యాణము అను మృదుమధుర ద్విపద కావ్యమును తెన్గున రచించిన తిమ్మక్క (15 వ శతాబ్దము) సుప్రసిద్ధ పద కవితా పితామహుడైన తాళ్ళపాక అన్నమాచార్యుని సతీమణి పీరి కుటుంబము పద కవితకు, ద్విపద రచనకు వాసికెక్కినది. అలవోకగా కృతులు రచించుట వీరి కులవిద్య. చక్కని తెలుగు జాతీయము, చిక్కని భావ మృదులత, మిను మిక్కిలియగు సుకుమార శృంగార రసావేశము ఒకదాని కొకటి మించి అలలవలె పైకొనగా రసార్ణవమున పరవశమున ముక్కలు వేయుచు నిందలి పన్నెండు వందల ద్విపద పాద

సోపానముల నధిగమించి, పఠితలు ఆనందపద సీమను తెలియకయే చేరు కొందురు.

ముగ్ధ మనోహరమైన ఇందలి వర్ణనలకు నిదర్శనము: అన్నగారగు శ్రీకృష్ణుడు తన్ను బిలువగా సుభద్ర కృష్ణుని దరిసినతీరు:

"అని యిట్లు తమ అన్న అంకించి పిలువ
పసిడి సలాక నా పణతి సుభద్ర
వలిపువ్వు గుత్తుల తవిరాకు బోణి
లలిత సౌరభ శోభ గుటకరింపంగ
నసి చక్కగా పైట నవరించు కొనుచు
నడ నడ చిన్నారి నడుము జవ్వాడ
అందెలు మ్రోయంగ హారముల్ తూగ
మొలనూళ్ళు ఘంటలు మద్దియల్ మ్రోయ
సందిదండలు వెల్గ సరిపెణలు దూల
దివ్వెలై హారముల్ తెరువు జూపగను
అల్ల నల్లన వచ్చె అన్నముందరికి
భద్రేభగమన సుభద్ర రమ్మనుచు
తోయజాక్షుడు తన తొడపైన నునిచె
నీలాలవంటి వానెలత నెఱి కురులు
హాలారు కొనగోళ్ళవడి చిక్కుదీసె
చుబుకంబు పైకెత్తి చూచి యొదార్చె
కుంచించుకొని శిరసు వంచుకొనబోవ
శిరసు తాబై కెత్తి చెల్లెలిన్ జూచి."

విద్యా విజ్ఞాన సంస్కారాదులచే నధికులయ్యు నా అన్నాచెల్లెండ్ర హృదయములనుండి పొంగులువారిన అకృత్రిమానురాగధుని పై పంక్తులలో వెల్లివిరిసి, ఆ యనురాగ మహిమను వ్యక్తీకరించుటకీ భాషాప్రపంచము చాలదనిపించెను. ఈ కావ్య మింత సుదిమెత్తని దగుటచేతనే చేమకూర వేంకటకవి యిందుండి పాదములకు పాదములు తన విజయవిలాసమున వాడుకొనెను.

## మహాకావ్యనిర్మాత్రి - ఆతుకూరి మొల్లరామాయణ మహాకావ్యము

శ్రీరామచంద్ర చరణారవింద సంసేవనానంద పారవశ్యమున రామాయణ మహాకావ్యమును రచించిన మొల్లకు ఆంధ్రవాఙ్మయమున నొక భద్రాసనము కలదు. పోతనార్యునివలెనే "చెప్పుమని రామచంద్రుడు!.........చెప్పించిన పలుకుమీద......నే" తెలుగునకు పొందై వీనులకు విందైన కందువమాటల సామెత లందముగాకూర్చి రామకథను కావ్యముగా గానముచేసిన మహాతపస్విని; మొల్ల!

ప్రౌఢపాండిత్యప్రకర్షకు, మురువుగులుకు తెలుగుమరుగులతోడి అర్థవ్యక్తి కల సులభశైలికి, వర్ణనలపట్ల సహజ చిత్రణకు, శబ్దార్థముల యొండొంట యొదుగుబాటుచే రూపొందు హృదయంగమ రూపకల్పనకును మొల్ల కవితా శిల్పము పేరుగాంచినది.

"సుడిగొను రామపాదములు సోకిన ధూళివహించి రాయి యే
ర్పడ నొక కాంతయయ్యెనట పన్నుగ నీతని పాదరేణు వి
య్యెడపడి నోడసోకయిది యేమగునోయని సంశయాత్ముడై
కడిగె గుహుండు రాము పదకంజయుగమ్ము భయమ్ము వెంపునన్"

ఇందలి గుహుని సంశయమునందలి హృదయంగమకల్పనకును, అద్భుత చిత్రణమునకును ఏమిచ్చి తెలుగుజాతి మొల్లఋణమీగగలదు?

"ఉన్నాడు లెస్సరాఘవుడు"......"కంటికిన్ జానకి......" మొదలగు పద్యములయందలి ఔచిత్యము "మొగముబిగించి........." మొదలగు పద్యములయందలి వర్ణనాసహజతయు అనితర సాధ్యములు.

కుంభకారకుల సంజాతయగు నీ మహానుభావురాలి తండ్రి ఆతుకూరి కేతన. ఈమె 16వ శతాబ్దమునాటిదనియు, ఆంధ్రభోజుడగు శ్రీకృష్ణదేవరాయల సమకాలీనయనియు నందురు. ఈమె శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునకేగి యా ప్రభుని ప్రశంసించుచు కొన్ని పద్యములను జెప్పెననియు నా ప్రభువామెను సత్కరించెననియు నందురు. కాని యిది సత్యేతరము. ఈమె శ్రీనాథమహాకవి యొక్క ముదిమివయసున జీవించినది.

## మోహనాంగి - మరీచీపరిణయకావ్యకర్త్రి :

కవులపాలిటి ముంగొంగు బంగారమైన ఆంధ్రభోజుడు శ్రీకృష్ణదేవ రాయల కుమార్తె మోహనాంగి మరీచీపరిణయ కావ్యకర్త్రి యను నైతిహ్యము సారస్వతలోకమున అనూచానముగ సాగివచ్చుచున్నది. కాని గ్రంథమెచ్చటను కానవచ్చుటలేదు.

కాని చాలాకాలముక్రిందట ప్రచురింపబడుచు వచ్చిన సమదర్శిని పత్రిక యందీమె కావ్య ప్రారంభపద్యములుగా ప్రచురింపబడినవానిని శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారు తాము రచించిన "భట్టుమూర్తి - రామరాజభూషణుడా?" అను గ్రంథమున ప్రచురించియున్నారు. వారు తాము ఆ పద్యములను సమదర్శిని పత్రికయందు చూచియుంటినని నా కిటీవలనే తెల్పియున్నారు. అవి యివి :

1. "అకలుష మాధురీకలితయై యలసాని కవీశుబోలె న
ల్లిక బిగి, ముక్కుతిమ్మకవి లీలను ముద్దుగుబల్కు, పాండురం
గకవిగతిన్ బదక్రమముగల్గు కవిత్వముతోడ విష్ణుచి
త్తుకథ రచించు మజ్జనకు దొరపుబత్తి నుతించి మ్రొక్కెదన్."

2. మనుచరిత్రము కృతిగ నొసంగు పెద్దన
దగు నాంధ్ర కవితాపితామహుండు
నర్థియై పారిజాతాపహరణము కృ
తిగ నొసంగిన నందితిమ్మనకవి
మాటల నతులిత మాధురీమహిమంబు
తోడ బల్కుచుండు ధూర్జటికవి
రనముప్పతిలుచుండు రచనచే సుధ వెద
జల్లు మాదయగారి మల్లనకవి

మున్నుగల యష్టదిగ్గజంబులను కవుల
మంత్రి సత్తముడైన తిమ్మరుసుగూడి
భువన విజయనామక సభాభవనమందు
నోలగంబుండు కృష్ణభూపాలుండు."

ఇదివరలో ఈమెదని చెప్పబడిన పద్యము నీ క్రింద చూపుచున్నాను.

ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిచూచి
తరుణితనుమధ్య మెచటికో తలగిపోయె
నుండెనేనియు గనుపడకున్నె యహహ
యుద్ధతులమధ్య పేదల కుండదరమె.

మోహనాంగి నిజనామము "తిరుమలాంబ" యని యొక యైతిహ్యము! ఇవియన్నియు నెంత యథార్థమో?

ఈనడుమనే మోహనాంగి మరీచీపరిణయ కావ్యము కృత్యాది పద్యముల వఱకు లభింపగా నెల్లూరు సాహితీయులు ముద్రించిరి. దానివలన శ్రీకృష్ణదేవ రాయలకు సంబంధించిన ఎన్నో చారిత్రకవిషయములు బయలుపడినవి.

## సంస్కృతకావ్య కవయిత్రులు

**తిరుమలాంబ—వరదాంబికా పరిణయము:**

వరదాంబికా పరిణయకర్త్రియగు తిరుమలాంబను ప్రస్తావించుటతో వైభవోపేతమగు విద్యానగరమునకు చెందిన కవయిత్రీచరిత్రము ముగిసినట్లే. గంగాదేవి, మొల్ల, మోహనాంగి *తుక్కాపంచకమును రచించినదను ప్రసిద్ధి పొందిన తుక్కాదేవియు తిరుమలాంబయు కలిసి వీరైదుగురైనారు.

శ్రీకృష్ణదేవరాయల యనంతర మాతని సవతితమ్ము డచ్యుతరాయలు సింహాసనము నధిష్ఠించెను. వరదాంబిక యాతని పట్టపురాణి. ఈ యిర్వురి పరిణయగాథను తిరుమలాంబ సంస్కృతమున చంపూగ్రంథముగా రచించెను. ఈమె తన కావ్యమున సర్గాంత గద్యలలో తన పాండిత్య ప్రాబల్యమునుగూర్చి చాలా అధికముగా ప్రస్తావనమొనర్చినది.

ఈ 1530 ప్రాంతపు కవయిత్రి గంగాదేవితో ప్రారంభమైన సంస్కృత కావ్యరచనకు తిరుమలాంబ రచనతో ప్రోది యేర్పడినది.

19వ శతాబ్ద్యంత్యభాగమువఱకు ప్రవర్తిల్లిన మహిళా సారస్వత మంతయు— మహిళాసారస్వతమే యననేల ఆంధ్రసారస్వతమే— కావ్య

* తుక్క పంచకమని ప్రసిద్ధిపొందిన శ్లోకము లైదింటను రెండు తత్పూర్వమే వల్లభదేవుని సుభాషితావళి యందును ఒకటి ముకుళభట్టు అభిధావృత్తియందును కానవచ్చుచున్నవని శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు వ్రాయుటచే నామెనుగూర్చి నేను ముచ్చటించ లేదు.

సాహిత్యమే. అందును ప్రాచీన సాంప్రదాయసిద్ధమైన కవితాశిల్పముదక్క ఇంకొక ప్రక్రియాభేదముకాని, రచనాశిల్ప భిన్నతకాని కాన్పించదు.

ఆంధ్రమునేకాక, ఎల్లభాషలకు సంస్కృతి సాంప్రదాయముల నొసగి సాకిన తల్లిభాషయగు దేవభాషయందు సమర్థముగ మహాకావ్యరచనచేసిన మానినీ మణులు పెక్కు రాంధ్రమహిళలుండుట నిజముగా ప్రస్తుతిప్రాతము. ఇట్టి కవయిత్రులలో తిరుమలాంబ రెండవది.

## నాచి-నాచీవిజయ నాటకకర్త్రి:

వేద వేదాంగకోవిదుడును, సంస్కృతాంధ్ర సాహితీ నిష్ణాతుడును, జ్యోతిషాది సమస్తశాస్త్రవేత్తయునైన వీలేశర్వోపాధ్యాయుల కుమార్తె నాచి గొప్ప పండితురాలు. బాల్యమునందే వైధవ్యమునొంది తండ్రికడ ఆయన గురుకులమున సాంగోపాంగముగ సర్వ విద్యా, శాస్త్ర కళా రహస్యముల శిక్షాపూర్వకముగ కైవసముచేసికొని కాశీయాత్రకై యిలువెడలి మధ్య మార్గమునగల పండితులను జయించి తన జయగాథలనే "నాచీ విజయ" మను పేర సంస్కృతమున నాటకముగ రచించిన ప్రతిభాశాలిని నాచి! ఈ అఖండ ప్రతిభావంతురాలి రచనమున ఒక శ్లోకమేని కాన్పింపకుండుట ఆంధ్రవాఙ్మయ దురదృష్ట మన వలెను.

## లీలావతి-గణితశాస్త్ర కావ్యకర్త్రి :

నాచిని పోలినదే లీలావతియును. సుప్రసిద్ధ గణిత శాస్త్రాచార్యుడైన భాస్కరాచార్యతనయ లీలావతి. లీలావతి కూడా గణితశాస్త్రవేత్త్రియే. పురా కాలమున నే విషయమును రచించినను కావ్యరూపమున రచించుటయే సాంప్రదాయసిద్ధమైన సదాచారమగుటచే లీలావతి తన గణితశాస్త్రమును సంస్కృత కావ్యముగ రచించినది.

భాస్కరాచార్యులు గొప్ప జ్యోతిషశాస్త్రవేత్త. తన గారాబుపట్టి లీలావతికి విధివిహితమైయున్న వైధవ్యమును తప్పింపవలెనని అతడెన్నియో యత్నముల నొనర్చెను. కాని అదికొనసాగలేదు. పసుపు పూయుటయు ముసుగువేయుటయు పాసము లీలావతి కొకమారు జరిగెను. జరిగినదానికి చింతించి భాస్కరాచార్యులు తన తనయకు గణితశాస్త్రమున ప్రవేశము కల్పించెను. అందామె

గొప్ప నైపుణ్యమును సంపాదించి "లీలావతి గణిత"మను పేర నొక గణిత శాస్త్ర గ్రంథము రచించెను.

లీలావతీ గణితము జగద్విఖ్యతి నొందినది. ఈగ్రంథము ఆంగ్ల, పరాసు భాషలలోనికి అనువదింపబడినది.

"అస్తి స్తంభతలే ఘటః తదుపరి క్రీడా శిఖండీ స్థితః
స్తంభేహ స్త నవోచ్ఛ్రితే త్రిగుణిత స్తంభ ప్రమాణా న్తరే
ద్వష్ట్వాహింబిల మాప్రజన్త మపత త్తిర్యక్స, తస్యోపరి
క్షిప్రం బ్రూహితయోర్బలాత్కతికరై స్స్యామ్యాన గత్యోర్యుతిః

ఆమె గణితశాస్త్ర కవిత యింత రసవత్తరముగా నున్నది.

**శారద, త్రివేణి :**

దేవరాయల ఆస్థానియగు శారద సంస్కృత కవయిత్రియట: విశేషములు తెలియవు.

త్రివేణి శ్రీరంగాభ్యుదయ చంపూ ప్రబంధమును ఇంకను ఇతర గ్రంథములును రచించిన త్రివేణియు సంస్కృత కావ్య కవయిత్రియే. రంగనాథ సహస్రము, లక్ష్మీనాథ సహస్రము, శ్రీరంగాభ్యుదయము, సంపత్కుమార విజయము రంగరాట్సముదయము, తత్త్వముద్రాభద్రోదయము, శుక సందేశము, భృంగ సందేశము అను పెక్కు సంస్కృత కావ్యములను రచించిన ప్రశస్త కవయిత్రి త్రివేణి. ఈమె కావ్యములన్నియు నింకను అముద్రితములై తంజావుర సరస్వతీ గ్రంథ భాండాగారమున ముద్రణభాగ్యమెపుడాయని తపించుచుండుట చింతాకరమైన అంశము :

గొప్ప విద్వాంసుడైన ఉదయేంద్రపురం అనంతాచార్యుల కుమార్తె ఈమె. తండ్రికడనే చక్కగా విద్యనభ్యసించినది. భర్త అయిన ప్రతివాది భయంకరం వేంకటాచార్యుల సన్నిధిని కూడా ఆమె విద్యకు మంచి దీప్తి కలిగినది.

త్రివేణి వైష్ణవి, విశేషించి శ్రీరంగేశభక్తురాలు. ఆమె కావ్యములయందు మొదటి రెండును సహస్రనామ కావ్యములు-మూడవది చంపువు. తత్త్వముద్రాభద్రోదయము విశిష్టాద్వైతమత సాంప్రదాయకరమగు వేదాంత గ్రంథము. శుక సందేశ, భృంగ సందేశ కావ్యములు, వియోగ శృంగార రసాత్మకములగు

సందేశకావ్యములు. శ్రీరంగనాథ చంపువున ఆశ్వాసాంతశ్లోకములలో తన కావ్యమును గూర్చి సద్బృంద వంద్యమైన మహా కావ్యమనియు అమ్నాయము వలె మధురమైనదనియు ప్రశంసించినది.

అది యిట్లున్నది.

"త్వద్గఙ్గోఙ్ఞ తరఙ్గ పఙ్క్తి విల సద్భంగత్రి ప్రాకృత్స్వ వా
గ్గుం భోఽనన్త విరస్త్వసూత తనయాం యో సౌత్రి వేణ్యాత్మికాం
శ్రీరంగాభ్యుదయే త్వయా విరచితే సద్బృంద వంద్యే మహా
కావ్యేఽసౌ దశమ స్సుధాకృతరస స్సర్గస్య మాధుర్యకృత్."

## రామభద్రాంబ (1633) రఘునాథాభ్యుదయము :

సంగీత సాహిత్య కళాకోవిదుడును, మహాపరాక్రమశాలియునైన రఘునాథభూజాని తంజాపురము నేలినపుడు అనేకులగు విద్వత్కవులను పోషించినట్లే, విద్వత్కవయిత్రులనుగూడా పోషించెను. ఆంధ్రవాఙ్మయ చరిత్రయందు కవయిత్రులను ఆస్థానములయందు పోషించుటయనునది నాయకరాజుల తోడనే ఆరంభమైనది.

రఘునాథ నాయకుని ఆస్థానమగు లక్ష్మీ విజయ విలాస భవనము కవి పండిత గాయక కవయిత్రులతో సందడిగా నుండెడిది.

నాయకరాజుల ఆస్థానముల యందలి కవయిత్రులందరును అష్టభాషా విశారదలౌటయేకాక ఆయా భాషలయందు కవిత్వము కూడా చెప్పగల దిట్టలు. సమస్యా పూరణము, ఆశుకవిత్వము, ప్రాస్తావిక పద్య కల్పనము, చిత్ర బంధ కవిత్వ రచనము మున్నగు కవిత్వ క్రీడలయందారితేరినవారు. వారు నాయక రాజాస్థానమునకేగాదు ఆంధ్రదేశమునందలి కవిలోకమునకే అలంకారమనదగిన వారు. రఘునాథ నాయకుని ఆస్థానమున మెఱసినవారిలో రామభద్రాంబ "రఘునాథాభ్యుదయము" అను ద్వాదశ సర్గలును 900 శ్లోకములును కల సంస్కృత కావ్యమును రచించెను.

రాజగోపాల విలాసాది కావ్యకర్తయగు చెంగల్వ కాళ కవి యీమెకు కవితా గురువు. అటనట వాడిన శార్దూల మాలినీ స్రగ్ధరా వృత్తములు దప్ప తక్కిన కావ్యమంతయు ఒకే ఛందము. ఇది రఘునాథ నాయకునిపై చెప్పిన

కావ్యము. ఇందు రఘునాథ నాయకవంశ, రాజ్య, పరాక్రమాది వర్ణనలేగాక ఆనాటి స్త్రీ విద్య, స్త్రీల సంస్కారము, సంగీతవిద్య, రావణహస్తము, నాటక రచనము, గాన నృత్య విశేషములును చెప్పబడుట గమనింపదగినది. ఆనాటి మూడేండ్ల బాలికల విద్యా వైభవముకూడ నాయక బహూకృతము కాదగినంత విశేషముగా నుండెనట.

"చింతా సమస్యా శతమేక ధైవతత్కీర్తి వార్తా నహి వర్ణనీయా
అశేషలోకాశ్రయ వృత్త భేద విద్యావిశేష ప్రథితస్య యస్య
అంతఃపురాన్తర్హరిణేక్షణాసుత్రిహాయణీనామపి దీప్యమానాన్
విలోక్య విద్యా విభవానజస్రం వశంవదాం యస్య వదంతి వాణీం

వశంవదయైన వాణితో విరాజిల్లు రఘునాథ నాయకుని కాలమునాటి విద్యావైభవమును రామభద్రాంబ చక్కగా వర్ణించెను.

తెలుగు భాషలో పూరించిన సమస్యలు ప్రాకృతమున చెప్పిన పద్యములు చాలా కలవు.

తెలుగు సమస్య : ఏరీ నీసరి రాజులు
భూరమణులు నిన్ను జాల బొగడుదురు భళీ
స్వారాజని, రే రాజని
రారాజని యచ్యుతేంద్ర రఘునాథ నృపా॥

ప్రాకృత సమస్య: పరిపుణ్ణ కళాహి సోహమాణో
అహోయం సక్కుళణిచ్చ సెవ్వమాణో
సహావి (స?) చెంది ఆవో
రహుణాక్ఖితి చెందిరో విహాయి

ఛాయ : పరిపూర్ణ కళాభిశోభమానః
అభితస్సత్కుల నిత్య సేవ్యమానః
సభియ (శః) చంద్రికాఢ్యో
రఘునాధక్షితి చంద్రో విభాతి

ఏ భాషలో వ్రాసినను మృదువగు శైలి, భావపుష్టి, ఈమె కవితా విశేష గుణములు.

## మధురవాణి-రామాయణసారకావ్య తిలకము :

సర్వకళా కుశలుడైన రఘునాథ నాయకుడు ఆంధ్రభాషయందు రామాయణ కావ్యమును రచించెను. దానిని సంస్కృతీకరింప సమర్థులెవరు? అని యా మహారాజు తన యాస్థానమున ప్రశ్నింపగా నెవ్వరును బదులాడక మిన్నకుండుటయు, తదాస్థానినియును, నాయకుని వలెనే సర్వకళా కుశలునియునగు మధురవాణి తాను సంస్కృతీకరింతునని తెల్పి యత్యంత ప్రభావ పూర్ణముగ నా భూధవుని కావ్యమును సంస్కృతీకరించుటయు జరిగెనట.

రఘునాథ నాయకుని "ఆంధ్ర రామాయణము" కాని మధురవాణి "రామాయణ సారకావ్య తిలకము" కాని సంపూర్ణముగ లభించుటలేదు. ఈ కావ్యము తంజాపురమునుండి బెంగుళూరు నందలి మల్లేశ్వరము నందున్న వేద వేదాంగ గ్రంథాలము చేరినదట. సుందరాకాండ వఱకు లభించుచున్నంతవఱకు 1500 శ్లోకములుగల 14 సర్గల గ్రంథము కనడుచున్నది.

మధురవాణి మహాప్రజ్ఞాశాలినియగు ప్రౌఢకవయిత్రి. సర్గాంత గద్యలలో ఈమె చెప్పిన "మాధుర్య ధురంధరాంధ్ర కవితా నిర్మాణా సమ్మాన్యయా" అను వాక్యమునుబట్టి యీామె ఆంధ్ర కావ్యములను కూడా వెలయించెనని తెలియుచున్నది. కాని యవి లభింపలేదు.

"ఘటికార్ధ నిర్మిత శత శ్లోకిననియు" "షడ్భాషారచనా విశేష బహుధా విఖ్యాత కీర్తి" కలదాననియు "సమస్త వ్యాకరణాదిశాస్త్ర నిష్ణాత" ననియు 'సద్యోవిస్మయ కృన్నిరోష్ఠ్య కవితా సందర్భ ధారాసుధాసారోర్మి పరిపూరిత శ్రుతిసుధీ సంభావితాభిఖ్య'ననియు 'సూరి నవ్య కుమార సంభవ మహాకావ్య ప్రతిగ్రన్థన ప్రాగల్భ్య ప్రకటశ్రియా పదపద ప్రఖ్యాత వైదుష్యము' కలదాననియు' 'ప్రౌఢ శ్రీరఘునాథ నాయక కృత స్వర్ణాభిషేక క్రియ'కలదాననియు సర్గాంత గద్యలలో వ్రాసినది. సూరిస్తూయమాన మగునట్లు కుమారసంభవ మహాకావ్యమును రచించినదట. ఏ భాషయందో ఈ ప్రతిభావంతురాలు రచించిన ఆ కావ్యము కానరాకుండుట ఆంధ్రుల దౌర్భాగ్యము కాక మఱి ఏమి!

ఈ మహా కవయిత్రిని సరసరసాధి దేవతయగు రఘునాథ నాయకుడు స్వర్ణాభిషేకము గావించెనట! అబ్బురమేమున్నది? "కథాగ్రథన సంవిధాన

ములో కళావైదగ్ధ్యములో, నీ కావ్యముత్తమ కావ్యమై రఘువంశ, కుమారసంభవాదుల యంత ఉత్తమముగా నున్నది. శబ్దములయందలి యవ్యక్తమధురమైన నాద విశేష మీమెకు బాగుగా తెలియును. పేశల మృదూక్తి కీమె శైలి పెట్టినది పేరు. భాష ఈ భాషాసరస్వతికి మిగుల వశవర్తిని, కల్పనాశక్తి యప్రతిమానము" అని శ్రీ కురుగంటి సీతారామయ్యగారు ఈ కావ్యమును ప్రశంసించిరి.

ఈ కావ్యమునందలి రఘునాథ నాయక వర్ణన ఘట్టమునందలి లక్ష్మీ విజయ విలాసభవన వర్ణనమును గాంచుడు :

బందీకృతాయేన పరక్షితీశమహామణీ మందో కీర్తి కన్యాః
పరార్థ్య దంతప్రతిమా నిభేన స్తంభం సమాలంబ్యా చిరం వసంతి.

(ఈ రఘునాథ నాయకుని సభాభవన స్తంభములపై చెక్కబడిన మణి పుత్రికలు; ఆ మహావీరునిచే జయింపబడిన పరరాజుల నుండి బందీగా తీసుకొని రాబడి స్తంభములకు కట్టివేయబడిన వారికీర్తి కన్యలవలె శోభిల్లుచున్నవై చిరకాలము ఆ స్తంభములయందే వెలయుచున్నవి). ఎంత రమణీయమైన కల్పనయో, ఎంత మనోహరమైన శైలియో పఠితలకే తెలియగలదు.

ప్రౌఢ పండితులకును దుర్గ్రాహ్యములగు "రాజనీతి రహస్యకా" వంటి ప్రయోగములెన్నో కలవు. ఆ ప్రయోగముల కామెయే యర్థము వ్రాయుటయు కలదు.

పండిత వాదమున మధురలోనున్న సరస్వతీ గ్రంథ భాండాగారమును గెలిచి తంజాపురమున ప్రతిష్ఠించిన అపర సరస్వతి యీమె.

రఘునాథ నాయకుడే యొసంగిన 'కిం తే రఘునాథ నాయకాయ స్తే' అను సమస్యను,

"కతి కతిన క్షితిపతయః కిం ? తే, రఘునాథ నాయకాయ స్తే."
భువి బహవరి కిలతరవః కిం ? తే, సంతాన పాద పాయ స్తే

అని వెంటనే పూరించినదట.

ఆమె పూరించిన ప్రాకృత సమస్య ఇంకొకటి.

తెల్లోక్కెక్క సుహావహ సుహయర, వియమరాహావం సఅణం దెణ్ణాణ ణియ తణూయం, వద్ధహి రహుణాహ రాయ పాహోహె

చాయ : త్రైలోక్యైక సుఖావహ శ్శుభకరో విజయ రాఘవ శశినం దృష్ట్వా నిజతనూజం, వర్ధేతే రఘునాథ పాథోధిః. క్రీగీతగల పాదము సమస్య.

రఘునాథ నాయకుని యాస్థానమున తేనెటీగలు రొదచేయునట్లు మహిళా కవయిత్రులు సందడి చేయుచుండెడివారట.

మహిళా కవయిత్రీమణులకు వసంతకాలమనదగిన నాయకరాజుల కాలము నందలి కవయిత్రు లందఱలో మధురవాణి నాయక హీరమణి. ఇంతతో ప్రాచీన యుగ సంస్కృత కావ్యరచన చేసినవారి చరిత్ర ముగిసినది.

## కృష్ణాజీ రంగాజీ :

ఉషాపరిణయ మన్నారుదాస విలాసములు :

రఘునాథ నాయకుని తర్వాత నాతని పుత్రుడు విజయరాఘవ నాయకుడును కావ్య ప్రణేత యగుటయే కాక సరస కళా వినోదియైన భూజానియై యుండెను. ఎందరో కవి, కవయిత్రులాతని యాస్థానమునుగూడా నలంకరించి యుండెడివారు. అందు రంగాజీ ప్రముఖ కవయిత్రి.

రంగాజీ పసుపులేటి మంగమాంబా వెంకటాద్రుల కుమార్తె. సంస్కృత ప్రాకృత, శౌరసేనీ, మాగధీ, పైశాచీ, చూళికా, అపభ్రంశ, ఆంధ్రభాషలలో కవిత్వమల్లగల్గిన అద్భుత ప్రజ్ఞావతి.

ఈమె తన గద్యలో చెప్పుకొనిన "విచిత్ర తర పత్రికా శత లిఖిత" త్వము, 'రాజనీతి విశారదత్వ'ము. 'అతులితాష్ట భాషా కవితా సర్వంకష విశేష విశారద'త్వమును 'శృంగార రస తరంగిత పద కవిత్వ మహనీయ మతి స్ఫూర్తి'త్వమును ఏ మాత్రము నతిశయోక్తులు కావు.

అద్వితీయ కవితా వైదుష్యములకు ప్రతిరూపమైన రంగాజీ కృతులు (1) మన్నారు దాసవిలాసము - ప్రబంధము (2) మన్నారు దాసవిలాసము— నాటకము (3) ఉషాపరిణయము ప్రబంధము-రామాయణ, భారత, భాగవత, సంగ్రహములు ఇవియన్నియు పద్యకావ్యములు. ఇవికాక లలిత ఫణితిని మృదు రసాస్వదముగ పెక్కుపదములు రచించెను.

వానియందు మన్నారు దాస విలాస నాటకము (యక్షగానము), ఉషా పరిణయము మాత్రము అచ్చుపడినవి.

ఉషాపరిణయ ప్రబంధమున గొప్ప కవితా శిల్పము గాని, నైపుణ్యము కాని అగపడకున్నను, సమాసాడంబరముచే సౌందర్యము కోల్పోవని సరళ సులభ గ్రాహ్యమగు శైలియు ధారావిశుద్ధియును స్పష్టముగా కన్పట్టును. శైలీ విశుద్ధతకు ఉషాపరిణయము నుండి :

"ఇచ్చకము లాడి మిక్కిలి విచ్చలవిడి గొల్ల చెలుల వేడుకమీరన్,
దచ్చనల గూడి జొణిగెడు నచ్యుతునకు మనుమడనిన నడుగగ నేలా."

నాయకరాజుల యాజమాన్యమున విలసిల్లిన దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయ మంతయు తెలుగునుడికారపు సొంపుతో తెలుగు భాషనే వాడియుండిరి ఆ ప్రభావమీ మహిళా వాఙ్మయమునను ప్రసరించి యుండుటలో అతిశయము లేదు. పై పద్య మట్టి దానికి ఉదాహరణయే.

మన్నారు దాన విలాస నాటక రచన పూర్తియైన వెనుక దానిని చదివి వినిపించుచుండగా తన స్వామి విజయరాఘవుడు హరివంశమునందలి ఉషా పరిణయ గాథను కావ్యముగా రచింపు మనగా తానీ జతన మొనర్చినట్లు ఈమె వ్రాసి యున్నది.

యక్షగాన శాఖకు చెందిన మన్నారు దాస విలాసము నాకటమునందు పట్టమహిషియగు కాంతిమతికిని, విజయరాఘవునకు జరిగిన వివాహ గాథ వర్ణింపబడినది.

15 వ శతాబ్ద్యంత భాగము నుండి ఆంధ్రవాఙ్మయమున యక్షగాన రచన ప్రారంభింపబడినది. ఆనాటి నుండి జరిగిన యక్షగాన రచనలో కవయిత్రు లును పాల్గొనుటలో వింత యేమియును లేదు. అట్టి యక్షగాన రచన మొనర్చిన కవయిత్రులు వేరుగా నున్నారు. వీరిని గూర్చి ముందు పేర్కొందును. రంగాజీ కావ్య ప్రణేత్రియే కాక నాటక కర్త్రి కూడా. అయితే ప్రాచీన లక్షణ లక్షితము లగు దృశ్య కావ్యములును మాత్రమే ఆంధ్ర సారస్వతేయులు నాటకము లనిరి. అంతేకాక సంస్కృత నాటకములను ఆంధ్ర కవులు కావ్యములుగనే అనువ దించిరి. అగుటచే ఆంధ్రులకు 15 వ శతాబ్దము వరకు దృశ్య వినోదము కాని, రంగ విజ్ఞానావకాశము కాని లభింపలేకపోయెనేమో. ఆ పండిత పామర లోకము నకును చిత్త విచ్ఛిత్తిని కల్గింపగల సాహిత్య ప్రక్రియా విధానముగా పాటలతో, మాటలతో కూడిన యక్షగాన ప్రక్రియను నాటక రూపమున తొల్దొంటి

ఆంధ్రులు సృష్టించుకొనిరి. అట్టి ప్రక్రియనే వారు నాటకమని పేర్కొనిరి. అట్టి నాటక శాఖకు చెందిన యక్షగానమే రంగాజీ కృతి "మన్నారు దాన విలాస నాటకము". ఇందు పాత్రోచిత భాష వాడబడినది. విజయ రాఘవు నాస్థానమున దక్షిణ భాషలగు తమిళ, కన్నడ, కేరళ భాషలయందును సంస్కృతము నందును, శౌరసేన్యాది సమస్త ప్రాకృతముల యందును కవిత్వము చెప్పగల్గిన చదురాంధ్రు కలరను ప్రశంసకు రంగాజీ అన్ని భాషల యందును చెప్పిన కవిత్వమే ప్రబల నిదర్శనము.

సంస్కృతము : ఔదార్య మంగన్నవభంగవిధాన ధుర్యమ్
శౌర్యంచ ధైర్యమపి శౌర్యపలాలనీయమ్
రూపంచ పంచశర వీరవిలోభనీయమ్
యస్యా స్త్యహో విజయ రాఘవ సార్వభౌమ ।

మాగధి : పశుపశరానన రూవేణ హరియ్య మహిమాయే
దాణేహం రాహే యే లియ యిరహు నహశామి నం వాణే.

చూళిక : ఖమళ విలోచన మధనే, యాచక ఝున ధావ్య పాదపో యేసో
భాహో భళ భళ వద్దే అరవికారయ వియయ రాహిహో విషయ।

ఇట్లే అన్ని ప్రాకృతములయందును ఆమె కవిత్వము చేసినది. ఇక అముద్రిత మగు మన్నారు దాస విలాస ప్రబంధమున రఘునాథ నాయక వర్ణన సందర్భ మున కల ఒక పద్యము.

సారభుజా బలంబునను, జక్కదనంబున, సద్గుణంబులన్
ధీరవతి ప్రతాపముల, దిక్కుల మిక్కి లి నిండు కీర్తులన్
ధారుణి బ్రోచు నేర్పున, నుదారదయన్ గవితా చమత్కృతిన్
శ్రీరఘునాథ భూమిప ఫణీమణికిన్, సములే నృ పాలకుల్.

ఇది శ్లేషాలంకార సమన్వితమైనది. శైలి ఇట్లే సులభ గ్రాహ్యముగా నుండును.

రంగాజీ అట నట తన కృతులలో వ్యాకరణ, జ్యోతిషాది శాస్త్రములలో దనకుగల ప్రజ్ఞా పాటవములకు దిక్ప్రదర్శకములగు ఘట్టములను వెలయించి నది. ఈ మన్నారు దాస విలాస కావ్యము, అల్లాడ విజయసింహ భూపతి విలాస కావ్య మను పేరున సౌందరియను నామె యింకొక కవయిత్రి వ్రాసినట్లు

మద్రాసు ప్రాచ్య లిఖిత భాండాగారమున కన్పట్టుచున్నదట. కాని అది సరికాదని తేలినది.

అసామాన్య ధిషణా ప్రాభవముగల ఈ కవయిత్రిని విజయ రాఘవుడు కనకాభిషేక గౌరవముచే సమ్మానించెననిన ఆశ్చర్యమేమున్నది?

నాయక రాజుల కాలమున పేరు పెంపులు వహించిన యీ కవయిత్రు లందఱును తమ ప్రభువులకు తాము ధర్మపత్నుల మనియే వ్రాసికొని యుండిరి. రంగాజీ యెడ బద్ధానురాగుడై విజయ రాఘవ నాయకుడు పట్టమహిషియైన కాంతిమతి యెడ విరక్తుడై యుండుట కాంతిమతికి మిక్కిలి వ్యసనము గూర్చుటయు దానిపై కాంతిమతి తన భర్తను రంగాజీ వశమొనర్చుకొనెనని దూషించుచు చెలికత్తెలచే రంగాజీ కేదియో వార్త పంపెననియు దానిపై రంగాజీ,

ఏ వనితల్ మముందలప నేమి పనో తమరాడు వారు కా
రో వలపింప నేర్పెఱుగరో. తమ కౌగిటలోన నుండగా
రావదియేమిరా విజయరామ యటం చిలుదూరి బల్మిమై
తీవర కత్తెనై పెనగి తీసుక వచ్చితినా తలోదరీ.

అని వెంటనే వ్రాసిపంపెనట. దానిపై తరువాత చాల గ్రంథము జరిగెను. విజయ రాఘవుడు రంగాజీతో తనకు గల సంగతి ధర్మబద్ధము కాదని తెలిసికొని రంగాజీ ఇంటికి వెళ్ళుట మానివైచెను. అయినను ఏకచారిణియగు రంగాజీ రాఘవుని ప్రణయమునే నమ్ముకొని వియోగ జీవితము గడిపి శుష్కించి మరణించెను. ఆనాటి నాయక రాజుల ఉపకాంత లందఱును పవిత్ర జీవనులై యుండుటయు, ఏకచారిణిలై విశుద్ధ ప్రణయినులుగా జీవితమును గడుపుటయు ఎన్నటికిని స్పృహణీయమగు నంశము.

రంగాజీ అక్కగారని చెప్పబడు కృష్ణాజీయు కవయిత్రియే గాని కృతులు కాన్పింపవు.

రంగాజీ నుండి బహుకావ్య రచనము కావించిన కవయిత్రీమతల్లు లగపడెదరు.

ఈ మహనీయురాంధ్ర కావ్యములన్నియు చారిత్రక పరిశోధనకు మిక్కిలి ఉపకరించు టొక గొప్ప యంశము. రంగాజీతో నాయకరాజుల కాలమునాటి కవయిత్రుల సందర్శన ముగిసినట్లే.

**ముద్దుపళని-రాధికా సాంత్వనము (1740-1780) మోహాశృంగార కావ్యము.**

ఆంధ్ర కవయిత్రీ లోకమున శృంగార మధుర కావ్యమును రచించిన ఏకైక కవయిత్రి ముద్దుపళని. ముద్దుపళనికాలము నాటికి భావుకత లోపముచేతను, అనుకరణ ధర్మముచేతను, స్త్రీల అంగాంగ వర్ణనా సభ్యత చేతను, అతిబాహ్య కామశృంగార కావ్యరచనా వ్యామోహము చేతను ఆంధ్ర వాఙ్మయము క్షీణ యుగ మనిపించుకొన్నది. కాలప్రభావము మహిళా కవయిత్రిని సహితము లోగొనుట ప్రత్యేక గమనార్హము. రామభద్రాంబ, మధురవాణి, తిరుమలాంబ రంగాజీ మున్నగు వారు వారి ప్రభువులకు ఉపకాంతలైనను, ఆనాటికే ఆంధ్ర సారస్వతమున మోహాశృంగార కావ్యరచన తలచూపియున్నను వారుమాత్రము ఆ దరిదాపులనే తొక్కి చూడలేదు. స్త్రీలు కూడా ఎట్టి అంశములనైనను నిరుపమ ప్రజ్ఞతో రచింపగలరని నిరూపించుటకై ముద్దుపళని ఈ కావ్య రచన చేసెనేమో.

ఏమో, ఏమోలతో నేమిపని? ముద్దుపళని మోహాశృంగార కావ్యరచన చేసినది. అందును ప్రస్తుతిపాత్రమగు రచనావిధాన ముట్టిపడునట్లు పదపదమునను ముద్దులు మూటగట్టినట్లు రచించినది.

నాయక రాజుల యనంతరము దక్షిణాపథము నేలిన ప్రతాపసింహుని కాలమున అనగా 1740-1780 ప్రాంతమున ముద్దుపళిని వెలసియున్నది. ఈమె తండ్రి ముత్యాలు; తల్లి పోటిబోటి.

గ్రంథము శృంగారరసార్ణవము. దీనికే ఇళాదేవీయమను నామాంతరము కలదు. రాధ ఇళను బాల్యమునుండి ప్రేమతో పెంచి ఆమెను కృష్ణునకిచ్చి పెండ్లిచేసి తన ప్రేమధనము కొల్లగొట్టబడెనని చాలా బాధపడుటయు ఇళా కృష్ణులు ఇళాదేవి తండ్రి కుంభకునింటికి వెడలగా విరహమోర్వలేక రాధ తన చేతిచిలుకను కృష్ణునికడకు రాయబారమంపుటయు, కృష్ణుడు రాగానే రోసమున రవాళించుటయు, కృష్ణుడు బ్రతిమలాడుకొనగానే ప్రశాంతత చెందుటయు ననునది ఇందలి కథాభాగము. ఇది నాలుగాశ్వాసముల కావ్యము.

రచనయందు మృదుమధురమగు తెలుగుభాష మఱుగు జాలువారు చుండును. సామెతలు కుప్పలు, తెప్పలు. సవతిగల స్త్రీ హృదయమునందలి

స్పర్ధాస్వభావము అచ్చువడునట్లు చాల సహజముగా వర్ణించినది. రాధ విరహ వర్ణనలు ఎంత మురిపెముగ నున్నవో చెప్పనలవికాదు. సుకుమారమైన స్పర్ధా భావమును, ఈర్ష్యను, కృష్ణునిపై తనకుగల అక్కసును వెలిబుచ్చుటలో అచ్చ తెలుగుపదములు వాడి ఈ పదములకింత అర్థశక్తి భావప్రదీపన సామర్థ్యము కలదా యనిపించినది, ముద్దుపళని:

"అల్లందుకొన్నను నీ
బెల్లింపులబడిన యొదల పెనుబాములకే
యిల్లైతి నరసిచూడగ
గొల్లనితోపొందు చెలికి కొదువే కొదువల్."

కృష్ణుని దెప్పుచు పల్కిన పల్కులలో దెప్పరికము వెనుకనుండి పైకి స్ఫుటముగా కనపడుచున్న ఆంతరంగికమగు అపేక్షను చూపుటలో ముద్దుపళని యెంతటి ఒయ్యారము కనబఱచినదో ముద్దుల మూటగట్టుచుండును.

"సొమ్ములియ్యవచ్చు- సొమ్మందమియవచ్చు
ఇయ్యరానిప్రాణ మియ్యవచ్చు
తనదు విభుని వేరు తరుణిచేతికినిచ్చి
తాళవశమె యెట్టిదానికైన?"

ఇళకు కృష్ణునప్పగించి వెనుదిరిగినవెంటనే పైకొనిన వియోగముతో బాధపడిన రాధ గోలతనము, బేలతనము, మానినీ హృదయగత సపత్నీస్పర్ధా స్వభావమును ఎంత కోమలముగనో చిత్రించినది.

వర్ణనలును, హాస్యమునుగూడా చాలా విశిష్టముగా నిర్వహించినది.

కాని కేవల బాహ్యముగ వర్ణించిన శృంగార వర్ణనాదులు వెగటుగనున్నవి. అది ఆనాటి కాలస్వభావమని యుపేక్షించి సంతృప్తిపడవలయు నంతే.

ముద్దుపళని, ఆండాళు పాశురములను కూడ తెలిగించినది. అవియును చాల రమణీయముగా నున్నవి.

**దార్ల సుందరీమణి-భావలింగశతకము (1829);**

ఆంధ్రదేశమున మిక్కిలి సుప్రసిద్ధుడైన తత్వవేత్త పోతులూరి వీర బ్రహ్మంగారి శిష్యవర్గమునకు చెందిన దార్ల సుందరీమణి 1829 ప్రాంతము

నాటిది. గుంటూరు జిల్లాయందలి చెర్లగుడిపాడునందలి గంజి శ్రీరాములు, నాగమాంబలు ఈమె తండ్రియు, తల్లియునైయున్నారు. రామచంద్రపురనివాసి యగు దార్ల శేషయ్యగారి నీమె భర్తగా బడసెను.

దార్ల సుందరీమణి సంఘకల్మషమును శక్తిమంతమగు భాషతో నిరాసము చేయుచు ఉద్దీప్తమగు భావములతో కూడిన తత్త్వశాఖకుచెందిన భావలింగ శతకమును రచించినది.

ఆంధ్రవాఙ్మయమున శతకము ఒక విశిష్టమైన ప్రక్రియ. ఏదేని ఒక మకుటమున సంఘములోని దురంతమును వెళ్లగ్రాసి, సంఘమును మంచిత్రోవకు మళ్ళించుటకును, ఇష్టదైవస్తుతికిని శతకమును ప్రయోగించుట వాఙ్మయమున ప్రాచీనకాలమునుండియు కన్పట్టుచున్నది.

అట్టి శతకములలో తత్త్వశాఖకుచెంది, సంఘకల్మషమును శక్తిమంతముగ బయటపెట్టిన ఒకేఒక గొప్పశతకము; వేమనశతకము :

పురుషులలో వేమన యొక్కడే అట్టి శతకమును వ్రాసెను. స్త్రీలలో దార్ల సుందరీమణి యొకతియే ఈ తెగకుచెందిన కవయిత్రి. వేమనకు పిమ్మట 19వ శతాబ్దమున నీమె రచించిన ఈ శతకమే మరల అంత ప్రతిభావంతముగా కన్పట్టుచున్నది. వేమనవలెనే ఈమెయు ఆటవెలదినే ఉపయోగించెను. సంఘ సంస్కారమునకే యిర్వురు యోగులును ఆటవెలదుల నుపయోగించుట భారతీయ సంస్కృతియందలి గొప్పతనమును (ఆకర్షణారహితమును) సూచించుచున్నది. ఈమె మకుటము "పాపభయవిభంగ భావలింగ'' అనునది.

ఈ గ్రంథమును సత్తెనపల్లితాలూకా కోనూరుగ్రామ వాస్తవ్యులైన బూదూరి సుబ్బారెడ్డిగారికడ చూచి సుప్రసిద్ధ కవివరేణ్యులు శ్రీ కొండవీటి వెంకటకవిగారు ఇటీవల ప్రచురించి ఆంధ్ర భారతి కొక యమూల్యాభరణమును ప్రసాదించిరి. దీనికి వీ రభివంద్యులు.

వ్యర్థపదములు లేకుండ, అందరును వాడుకొను పదములలో, మహార్థమును ప్రతిపాదించు శక్తి యీ పద్యములకు మూలశక్తి.

"భూమిగోరువారు బూడిదైపోయిరి
ధనముగోరువారు దగ్ధమైరి

నిన్నుగోరువారు నిత్యులై యుండిరి
పాపభయనిభంగ భావలింగ."

ఆడినమాట తప్పకుండుటలోని గొప్పతనము నెంత గొప్పగా ప్రతిపాదించినదో చూడుడు.

"మాటనిల్పువాడు కోటియేండ్లుండును
మాటనిల్పడేని మరణమొందు
మాటనిల్పుపదవి మఱినేర్వదేలకో ॥ పాప॥

నిర్గుణనిరాకార తత్త్వోపాసననుగూర్చి ఎంత సూక్ష్మముగా ఎంతసులువుగా తేట తెలుగుమాటలతో ఎంత అర్థవంతముగా పల్కినదో చిత్తగింపుడు :

"ఏమిలేదటంచు నెన్నివిద్యలో చెప్ప
వేయివిద్యలేల? వెఱ్ఱి! చదువ?
నేమిలేనివాని నెఱఁగినంజాలదా ॥పాప॥

ఆటంబాంబునో, అమృతభక్ష్యమునో, అవసరసందేశమునో పొట్లముకట్టి సూటిగ హృదయములోనికి గిరవాటువేసిన ఈయమ కవితాశక్తి మిక్కిలి ప్రశంసాపాత్రము.

## తఱికుండ వేంగమాంబ (1840-80)

వేంకటాచల మహాత్మ్యము :

ఆంధ్ర సాహిత్యమున పేనుమిగిలిన విదూషిగా, కవయిత్రిగా పేరొందిన తరికుండ వేంగమాంబ మహాయోగిని. ఈమె 19వ శతాబ్ద మధ్యభాగమున జీవించియున్నట్లు బ్రౌను మహాశయుడు వ్రాసియుండెను.

ఆంధ్ర సారస్వతమున మొల్లకును, ముద్దుపళనికి, తఱికుండ వేంగమాంబకును గొప్ప స్థానము కలదు. తిమ్మక్క సుభద్రాకళ్యాణము, తక్కిన గ్రంథములును ఇటీవలనే బయల్పడుటచే పూర్వకవి చరిత్రకర్తలు వీరినే కవి చరిత్రలలో పేర్కొనుచు వచ్చిరి.

వేంగమాంబ కృతులు చాలకలవు అందు ద్విపదరాజయోగసారము, వేంకటాచల మహాత్మ్యకావ్యమును చాల ప్రఖ్యాతములు. ఇవికాక ఆమె ద్విపద

భారత, భాగవతములను రచించినది. నరసింహశతకమను నొక శతకము, నరసింహ విలాసకథ, శివనాటకము, పారిజాతాపహరణ సత్కృతి, కృష్ణ నాటకము, రమాపరిణయము (పెండ్లిపాట), చెంచునాటకము, కృష్ణమంజరి (ద్విపద), శ్రీ రుక్మిణీనాటకము, గోపికానాటకము, ముక్తికాంతావిలాసము అను పెక్కు గ్రంథములను రచించెను. ఇందు ద్విపదలు, శతకము, పెండ్లిపాట కాక తక్కినవన్నియు యక్షగానములై యుండునేమో. ఇప్పుడివి యన్నియు లభింపవు. పారిజాతాపహరణ యక్షగానముమాత్రము ప్రాచ్యలిఖితభాండాగారమున లభ్యమగుచున్నది.

ఈమె బాలవితంతువు. తండ్రి కానాలి కృష్ణాచార్యుడు, తల్లి మంగమ్మ, సోదరుడు కృష్ణుడు. గురువు వేదాంతోపదేశికుడు; సుబ్రహ్మణ్యదేశికులు.

"నా చిన్ననాట నోనమాలనైన
నార్యులెవరు నా కానతీలేదు
ఇకనేను చెప్పుదునెట్టులో వాణి
నకలంకుడై జిహ్వయందుంచెగురుడు."

అని యీామె వ్రాసినదానినిబట్టి గురుకటాక్ష మహిమచే నత్యద్భుత కవితా ప్రావీణ్య మలవడెనని తలంపవలసియున్నది.

కవిత్వమందల్పదోషములున్నను కవనమతి మనోహరమైనదని శ్రీ వీరేశలింగంపంతులుగారు వ్రాసియుండిరి.

రాజయోగసారము కపిలునకు దేవహూతికిని జరిగిన తాత్త్విక సంభాషణము.

"సంపదగల్గిన సామర్థ్యమనుచు
సొంపుమీరగ తుచ్ఛ సుఖ మిచ్చయించి
కామాంధులై తమగతి గానలేక
భామల యొడిలోన బడి లేవలేక
తలుగని యీాషణత్రయవార్ధిలోన
మఱిమఱి మునుగుచు మమతరెట్టింప
నాలుబిడ్డలకని యర్థంబుగూర్చి

కాలంబు నూరకే గడుపుచునుండి

... ... ... ...

... ... ... ...

పుట్టుచు గిట్టుచు బొరలుచుండెదరు."

వేంకటాచలమహాత్మ్యము కలియుగప్రత్యక్షదైవమగు వేంకటేశ్వరస్వామి మహాత్మ్య గాథాకథనము.

ఇది కేవల మహాత్మ్య కథాగ్రంథమైనను, మనోహరమగు వర్ణనలు, కాంతిపూర్ణమగు శైలి, హృదయంగమములగు ఉపమాద్యలంకారముల తోను గూడి చాల ప్రౌఢముగా నున్నది. ఈ కావ్యశైలి:

"శరదభ్రశుభ్ర భాస్వర శరీరంబునందు
శ్వేతప్రకాశ విభూతి మెఱయ
ధవళ సంపూర్ణ చంద్ర కళంక మనగ
నైల్యవత్కృష్ణాజినంబు మెరయు" నట్లుగా నున్నది.

**ఇతరశతక కవయిత్రులు:**

తఱికుండ వెంగమాంబతో ఈ కావ్యయుగమున ప్రసిద్ధ కవయిత్రు రాంధ్రనుగూర్చి తెలిపినట్లే ఇక రాఘవరామ, రఘురామ, కేశవరామ శతకములను రచించిన మదిన సుభద్రమ్మ.

"మీనాక్షీశతక" కవయిత్రి బండి బాపమ్మ, 'వేంకటరమణ శతక' కవయిత్రి రత్నమాంబ, "జానకీశతక" కవయిత్రి చెలికాని చెలాయమ్మయు నిట నుస్మరణీయలు.

## యక్షగాన కవయిత్రులు

**బాల పాపాంబ :**

ఈ ఆంధ్రకవయిత్రీ చరిత్రయందు కావ్యకవిత్వ విభాగమును పూర్తి చేయుటకు ముందు కాలవిభాగమును పట్టి ముఖ్యముగా ప్రాచీనాధునిక కవితా దృష్టినిబట్టి యక్షగాన వాఙ్మయరంగమున పరిశ్రమయొనర్చిన మహిళామణులను గూర్చి పేర్కొను టవసరమైయున్నది.

యక్షగానము ప్రయోగ యోగ్యమైన దృశ్యరచనము అట్లని కేవల సంస్కృత నాటక లక్షణలక్షితముకానేరదు. గీత,పద్య గద్యరూపమైన, పండిత పామరరంజకమైన గేయ నృత్యరూపమైన సాహిత్యప్రక్రియ యక్షగానము.

ఆంధ్రవాఙ్మయ యక్షగాన చరిత్ర లిఖించిన ఆంధ్ర విశ్వవిద్యాలయాంధ్రా చార్యులు డా॥ యస్వీ. జోగారావుగారు "మనకిప్పటికి దెలిసినంతలో దెనుగున వెలసిన మొట్టమొదటి యక్షగానము క్రీ॥ శ॥ 15వ శతాబ్ది యుత్తరార్థమున నుండిన ప్రోలుగంటి చెన్నశౌరి సౌభరిచరితమే" నని తమ యక్షగానచరిత్రలో వ్రాసియున్నారు. శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు ఆంధ్ర మహిళలో 'విస్మృత కవయిత్రి బాలపాపాంబ' అను వ్యాసము వ్రాయుచు అక్కమహాదేవి చరిత్రమును యక్షగానముగ రచించిన వీరభోగ వసంతరాయల కుమార్తె బాలపాపాంబ 1600 ల సంవత్సర ప్రాంతమున వెలసియున్నట్లు తెలిపియున్నారు.

దీనినిబట్టిచూడ యక్షగాన రచనమునందు స్త్రీలు ఏమియు వెనుకబడలేదని తెలియుచున్నది.

బాలపాపాంబ వీరభోగవసంతరాయల కుమార్తె. శ్రీశైల మల్లికార్జున ప్రియభక్తురాలైన కర్ణాటక మహాయోగిని అక్కమహాదేవి చరిత్రము నీమె యక్ష గానముగా రచించినది.

పండిత పామర రంజకమగుటచే యక్షగానము మతప్రచారార్థము అధిక ముగ నుపయోగింపబడినది. అక్కమహాదేవి చిక్కనైన శివశరణి పోతులూరి బ్రహ్మంగారి తత్త్వమును, మాయాద్వైతమును ప్రబోధముచేయు కాలజ్ఞానాదుల యందు ప్రసక్తుడైన వీరవసంత వసుమతీశుల కొమరితయు, భద్రకాళి భక్తురాలు నైన బాలపాపాంబ అక్కమహాదేవి చరితమును యక్షగానముగ రచించుటలో వింత యేమియు లేదు.

"అష్టయోగాది విద్యాప్రవీణకుడగు, వీరవసంత వసుమతీశునకు ప్రథమ పుత్రిక బాలపాపాంబ యనగ, నధిక తేజంబున నపుడుద్భవింప సంగీత సాహిత్య వర లక్షణముల, రంగుమించినయట్టి రమణిదానగుచు నలభద్రకాళి నా యాత్మలోపలను బలికించునేరీతి, పలికెదననుచు నవనిలో యక్షగానావళికెల్ల, రవళిమించిన శిరోరత్నమోయనగ మంగళ ప్రదమగు మహాదేవి చరిత, యింగిత జ్ఞానియై యీ కృతిజేసె."

బాలపాపాంబ కృత్యాదిన వ్రాసిన ద్విపదనుబట్టి పై యంశములు స్పష్టమగుచున్నవి.

"ఈ యక్షగానమున జంపెలు, రచ్చతేకులు, ఏకతాళి మొదలగు దేశి పద రచనలు, జోలపాటలు, మంగళహారతులు మొదలగు పాటలు కలవు ఇవి యన్నియు బాలపాపాంబ సంగీత సాహిత్యవిద్యను ప్రదర్శించును" అని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు వ్రాసియున్నారు. అక్కమహాదేవికి అల్లమ ప్రభు వొనరించిన తత్త్వోపదేశముపట్టున ఈమె చూపిన నైపుణ్యముబట్టి తరికుండ వేంగమాంబకు ముందుగా యోగమార్గోపదేశమును సాహిత్యబద్ధముచేసిన ఆంధ్ర కవయిత్రి బాలపాపాంబ యనియు వీరు తెల్పియుండిరి. ఈమె గొప్ప యోగ నిష్ఠాపరురాలు. పవిత్రజీవన సంగీత సాహిత్య విద్యావైదుష్యములు గల మహిళా రత్నము. అట్టి యీమె రచన, ప్రప్రథమాంధ్ర మహిళా యక్షగాన రచనము ముద్రణాభాగ్యము నొందకపోవుట శోచనీయము.

**అన్నదానము వెంకటాంబ 18 వ శ. :**

'రామాయణము'ను యక్షగానముగ రచించిన అన్నదానము వెంకటాంబ సేలం జిల్లా హోసూరు తాలూకా తోగిరాగ్రహారమను శ్రోత్రియ గ్రామమందలి అన్నదానం వెంకటరామావధానుల భార్య. ఈ గ్రంథమున కొన్ని దోషము లున్నవి. ఇందు ప్రసిద్ధ రాగతాళములలో దరువులు, కీర్తనలు, ద్విపదలు, సీస గీత పద్యములు, వచనము, లాలి, శోభనము. మంగళహారతి పాటలు కల వనియు, ఇందలి శైలి ఆఖ్యానకశైలియనియు, రాముని బాల్యము, సీతా కళ్యాణము మున్నగు వర్ణనలలో చక్కని తెనుఁగు తన ముట్టిపడుచున్నదనియు శ్రీ జోగారావుగారు రచించియుండిరి.

**రూస్తానుపేట రత్నమ్మ (1847-1929)**

ఈమె రెడ్డికులజ. జన్మస్థానము ఇప్పటూరు. నివాసము వర్గి తాలూకా రూస్తానుపేట రచనము 'శివకురుపంజి' ఇతర కృతులు 'వేంకటరమణ' 'శ్రీనివాస శతకములు', 'బాలబోధ', 'దశావతార వర్ణనము' మొదలగునవి.

**ఓడం రచయిత్రి-శ్రీరామపుత్రి :**

"శ్రీరామపుత్రి" యను మారుపేరున నొక కవయిత్రి వ్రాసిన సీమంతినీ చరిత్ర మొకటి కనఁబడుచున్నది. ఇందు 'ఓడం' అను పద్ధతికి చెందిన పాట

కన్పట్టుచున్నది. ఈ పేరతివిచిత్రముగ నున్నదనియు ఇతరత్ర కూడా ఇది కేవలమశ్రుత పూర్వమనియు శ్రీ జోగారావుగారు తెలిపిరి. ఇది 1907 లో రాజ రాజేశ్వరీ నికేతన ముద్రాశాల యందు ముద్రింపబడినది.

ఉదా : "చూడ చూడా వేడకాయె, సీమంతీ
నేడు పెండ్లికూతురాయె
మూడు భువనాల్ కీర్తినిండే-దుఃఖంబూ
వీడి తనదూ విభునిగూడె
బంగారు తట్టతో మంగళారతులూ
శృంగారముగనిచ్చి అంగనలు అపుడు."

కొత్తూరు రంగనాయకమ్మ : "ఆండాళ్ళు చరిత్ర" :

ఈమె ఈచంబాటి శ్రీనివాసాచార్యుల శిష్యురాలని మాత్రముఇందలి కొన్ని పాటల వలన తెలియుచున్నది. ఇది యిట్టుండ వరయూరు జియ్యరు తిరుపతి సంబంధురాలగు రామానుజమ్మ రచించిన "శ్రీరంగనాథ పంగుణుత్తరోత్సవ యక్షగానము" చివర "తంగ బిందు" అను రంగనాథస్తుతి పరమైన యొక గేయము చివరి చరణమున "ఈచంబాటి శ్రీనివాసచార్లకృపను-రంగదాసురాలిని బ్రోవరా" అని యుండుటచే రామానుజమ్మయు, రంగనాయకమ్మయు, నొకరో లేక వీరిరువును ఒక గురువు శిష్యురాండ్రో తెలియుట లేదని శ్రీ జోగారావుగారి లేఖనము. రంగనాయకమ్మచే రచింపబడిన ఆండాళ్ళు చరిత్రమునందలి రచన యందు కొద్దిదోషములున్నను రచన చక్కగానున్నదనియు, పెండ్లి వేడుకల పాటలు మచ్చటగా నున్నవనియు శ్రీ జోగారావుగారు వ్రాసిరి.

**రామానుజమ్మ :**

శ్రీరంగ పంగణ్యుత్తరోత్సవ యక్షగానము కూడ బాగున్నది. ఇందు శ్రవ్య కావ్య ధోరణిహెచ్చు.

**శేషాంబ :**

ఈమె కానాలవారి యాడపడుచు. కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలూకా నందిపాటి గ్రామము. ఈమె రచన "మిత్రవిందాపరిణయము" 1919 లో ముద్రితము. భాగవతమున నామమాత్రముగ నున్న ఈ కథను "అపూర్వ

పాత్ర చిత్రణ" తోడను, మాంసలముగా దీర్చి మనోజ్ఞ నాటక ఫక్కిని రచించి నది. రచన ఆధునికముగా నున్నదని శ్రీ జోగారావుగారు వ్రాసిరి.

వీరుగాక 'సుల్తానీ కళ్యాణము' వ్రాసిన 'అలమేల్మంగ తాయారమ్మయు' 'రుక్మిణీ కళ్యాణము' వ్రాసిన ఏనుగుల చూడమ్మయు, 'కపోత వాక్యము'అను యక్షగానమును రచించిన బలభద్రదాని, 'ముక్తికాంతా విలాసము'. 'చిక్కదేవ రాయవిలాసము' మున్నగు కావ్యములు రచించిన 'హోసూరి పాకమ్మ'యు ఇంకను పెక్కురు యక్షగాన కావ్య కవయిత్రు లగపడుచున్నారు.

సుమారు నలుబది మందికి మించిన కవయిత్రులు ఈ యక్షగాన కావ్య శాఖలో ఉపలబ్ధమగు చున్నారని ఆంధ్రవాఙ్మయము నందలి ఒక ప్రధానశాఖ యైన యక్షగాన సారస్వతమునందు కావ్యరచన గావించిన కవయిత్రుల సంఖ్య యనల్పమే యనవచ్చును.

## నవ్యాంధ్రయుగము-మలితరము

ఆంగ్ల విద్యాధికతతోబాటు, ఆంగ్ల వాఙ్మయ ప్రభావము భారతదేశము నందలి అన్నిదేశ భాషలపై ప్రసరించుట జరిగిన వెనుక, భారతదేశమునందలి ప్రధాన దేశభాషా సారస్వతముల రూపమే మారిపోయినదని చెప్పవచ్చును. ప్రధానముగ రచనా సంవిధానము మార్పుచెందినది.

వచన సాహిత్యమన్నను, నవలా సాహిత్యమన్నను, కథాసాహిత్య మన్నను, జాతీయ కవితయన్నను, దేశాభిమానగేయ వాఙ్మయమన్నను ప్రజ లకు ప్రీతి మెండైనది. ఈ లక్షణము ఆంధ్ర వాఙ్మయమున 19 వ శతాబ్దపు చివరి భాగము నుండియు కన్పించుచున్నది.

పాశ్చాత్యుల దాస్యమునుండి మాతృభూమికి విమోచనము కల్పించి తీర వలెనని కాంక్షా తీవ్రత నానాటికి ముదిరి ఆ కాంక్ష ఉద్యమముగా మారినకొలదీ ఆంధ్ర సాహిత్యమున దేశభక్తి భావ ప్రబోధ బంధురమైన రచనలు హెచ్చు కా జొచ్చినవి. ఆంగ్లేయ దాస్య విముక్తికొఱకు బయల్వెడలిన ఈ కవితలో, భావ ప్రకటనా పద్ధతి, రచనా సంవిధానము ఆంగ్ల కవితా ప్రభావముద్రతో నుండుట గమనార్హము. ఈ పద్ధతి కవిత అఖిలభారతమునందును ప్రాదుర్భావమందినది.

మన ఆంధ్రదేశమున శ్రీ గురజాడ అప్పారావుగారి రచనల తోడను, వచన, కథా, నవలా, విమర్శక వాఙ్మయమునకు సంబంధించినంత వఱకు శ్రీ వీరేశలింగం పంతులుగారితోడను ఈ మార్పు ప్రారంభమైనది. ఇంతియేకాక శ్రీ పంతులుగారి ప్రబోధన ఫలితముగా స్త్రీ విద్యాసంస్కార ప్రబోధ వాఙ్మయము ఆంధ్రదేశమున మహిళలచే సృజింపబడు టొకటి ఈ యుగ సాహిత్య లక్షణములలో నొకటిగా పరిగణింపబడవలసి యున్నది. భావమున మార్పుకాన వచ్చినది. కాని ఛందస్సు మాత్ర మీ యుగమున ప్రాతఛందమే.

ఇంకొక విశేషమేమన, శ్రీ పంతులుగారు ప్రారంభించిన వితంతు వివాహోద్యమము, సాంఘిక రంగమున సనాతన మతమనబడు మూఢ విశ్వాసమును కూకటి వ్రేళ్ళతో కదిలించివేసినదగుటచే ఆ సంస్కారమునకు వ్యతిరేకముగ కొందరు సనాతనమత విశ్వాసము కలవారు తాముపత్రికా ముఖముగాను, ఉపన్యాసముల ద్వారాను, గ్రంథ రచనముతోడను ఈ సంస్కారము నెదుర్కొనుటే కాక, పండితురాండ్రగు స్త్రీలచే పత్రికలు నెలకొల్పింపజేసి యందు ఈ సంస్కార వ్యతిరేక భావములతో గల స్త్రీల రచనలకు హెచ్చు ప్రాధాన్యము నిచ్చునట్టి వాతావరణము కల్పించిరి. మఱల కొందఱు సంస్కారవంతురాండ్రగు మహిళామతల్లులు పైన పేర్కొనబడిన సంఘ సంస్కార వ్యతిరేక భావములను ఎదుర్కొనుటకై తామును పత్రికలు స్థాపించియుండుట ఈ కాలమున విశేషముగ పరిగణింపదగును.

శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి శిష్యవర్గమునకు చెందినవారు, గొప్ప పండితురాలునైన శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు సనాతన ధర్మ వ్యాప్తికొఱకు సావిత్రియను పత్రికను స్థాపించి నడిపిరి. ఇక తరువాత బాలాంత్రపు శేషమ్మగారు హిందూ సుందరి పత్రికను. వింజమూరి వెంకట రత్నమ్మగారు 'అనసూయ' పత్రికను స్థాపించి అనేక విధముల మహిళా ప్రబోధము గావించుటకై శ్రమించుట యొక గొప్ప విశేషము.

ఇట్టు నూతన మార్గములలో కవయిత్రులలో నూతన వికాస లబ్ధికొఱకైన ప్రయత్నము లనేకము కొనసాగిన తరుణమున

శ్రీమతి కోటికలపూడి సీతమ్మ శ్రీ పంతులుగారి అనుయాయినియై ఎంతో విశిష్టమైన భావ పద్ధతితో కావ్యములు రచించి పేరుగాంచిరి. 'సాధురక్షాశతకము'

'అహల్యాబాయి', 'పద్య భగవద్గీత', 'భక్తిమార్గములు', 'సతీధర్మములు', 'లేడీ జేన్ గ్రే',' శ్రీ వీరేశలింగంగారి జీవితచరిత్ర' అను కావ్యముల కీమె జనయిత్రి. శైలి మిక్కిలి సరళము.

అహల్యాబాయి కావ్యమున—

"స్త్రీలు విద్యనేర్వ జెడిపోదురను మాట
కల్లయనుచు దోచ నెల్లఱకును
విశద పఱతునొక విద్యావతి చరిత్ర
సంగ్రహమ్ముగాగ చదువుడయ్య" అని వ్రాసియుండుట గమనార్హము. అంతేకాదు. వారి సాధురక్షా శతకమున బ్రాహ్మ సమాజ సంస్కార భావకాంతి వెల్లి విరిసి యుండుటయు గమనింపదగిన యంశమే.

1913 వ సంవత్సరమున బాపట్లయందు జరిగిన ప్రథమాంధ్ర మహిళా సభ కధ్యక్షత వహించిన, తరుణీ రత్నమీమె ! ఈమె తెనాలి తాలూకా జెముడు పాడు వాస్తవ్యులు శ్రీ అబ్బూరి సుబ్బారావుగారి తనయ, శ్రీ కొటికలపూడి రామారావుగారి సతీమణి. పీఠికాపుర రాణియగు శ్రీరాణీ చిన్నమ్మారావుగారిచే గురుస్థానమున సమ్మానింపబడిన మహిళారత్నమీమె.

**రాణీ చిన్నమ్మారావుగారు :**

ప్రఖ్యాతాంధ్ర భాషా పోషకులు, సంఘ సంస్కర్తయునైన మహారాజా రావు సూర్యరాయ మహీపతి బహద్దరు వారి ధర్మపత్ని యీమె. విద్వత్కవయిత్రి యగుటయే కాక, కొటికలపూడి సీతమ్మ, జూలూరి తులశమ్మ మున్నగు విద్వత్కవయిత్రుల నాస్థాన కవయిత్రులుగ, మన్నించి, కవితా గోష్ఠులు నెఱపిన రసజ్ఞురాలు. పద్యకావ్యములనే కాక, 'ఉపన్యాస మాలిక' అను పేర తన ఉపన్యాసములను కూడ ప్రచురించి యుండిరి. వారి కావ్యములు మాత్రము కానరాకున్నవి.

**కందుకూరి రాజ్యలక్ష్మమ్మగారు**

శ్రీ వీరేశలింగము పంతులుగారికి అన్ని విధముల అర్హురాలైన ధర్మపత్ని. రాజ్యలక్ష్మమ్మగారు కూడ బ్రహ్మమతాను సారముగ కీర్తనలు రచించిరి.

శ్రీపంతులుగారి సంస్కారోద్యమమున అన్నివిధముల ఈమె సహాయ ముండుట చాలా గొప్పవిషయము.

## భండారు లచ్చమాంబగారు (1874)

ఈమె సుప్రసిద్ధ విమర్శకులు, భాషా సేవకులైన కొమర్రాజు లక్ష్మణ రావుగారి సోదరి, భండారు అచ్చమాంబ. ఈమె 'అబలా సచ్చరిత్ర రత్నమాల' యను వచన గ్రంథమును రచించెను పౌరాణిక స్త్రీలు, చారిత్రిక స్త్రీలు, విదేశ రమణులు-అను మూడుభాగములు గలగ్రంథ రాజమిది. స్త్రీలలో ప్రప్రథమముగ వచన కావ్యమును రచించిన ఖ్యాతి యీమెకు దక్కినది గ్రంథ శైలి మిక్కిలి సరళ సుందరము.

## బుర్రా సూరమాంబగారు

విద్వత్కుటుంబముగా పేరుగాంచిన బుర్రావంశమునకు చెందిన కవయిత్రి ! శ్రీకాకుళ వాస్తవ్యులగు శ్రీ బుర్రా దేవనాథంగారి పత్ని. భారతీస్తవ స్తబకము, హరనాథ, నందనార శతకములు - ప్రహ్లాద నాటకము రచించిరి; ఈ యుగమున రచింపబడిన నాటకములన్నియు, ప్రాచీన కావ్యలక్షణ లక్షితములు.

## వేమూరి శారదాంబ (1881-1889)

సుప్రసిద్ధ నృత్యసంగీత సాహిత్యవేత్తయు, కవి పండిత గాయక నర్తక శిరోమణియునైన దాను శ్రీరాములుగారి, కుమార్తె. శ్రీరాములు గారి దేవీభాగవత కావ్యము, తెలుగు నాడులను ఖండకృతియు ఆంధ్ర వాఙ్మయమున సుప్రసిద్ధములు. ఈమె తన పదకొండవయేటనే కవిత్వము చెప్ప నారంభించి ముచ్చటగ మూడు కావ్యములు రచించి పదునెన్మిదేండ్ల వయసున మరణించిన మహామనీషి. మద్రాసున ఉద్యోగము సల్పుచున్న భర్త శ్రీ వేమూరి రామచంద్రరావు గారితో మద్రాసున నివసించుచు 11వ యేటనే నాగ్నజితీ పరిణయమను కావ్యమును ప్రథమ రచనా పుష్పముగా వెలయించిరి. ఇది నగర్తువ శశిఋత్వాదికమగు నష్టాదశవర్ణనలతో ప్రాచీన కావ్యలక్షణానుసారము రచింపబడినది. ఐనను, ఇందు వెఱ్ఱిమొఱ్ఱి విరహ వర్ణనలును, చంద్ర దూషణాదులును లేవు. శైలి తేజోవంతముగను ధారావాహికముగను నున్నది.

ఈమె యింకొక రచనమగు మాధవ శతకమున ఆనాటి సంఘము నందలి స్త్రీల అవిద్యా ప్రగాఢతను చాలా సహజముగా వర్ణించినది.

గొల్లది చల్లవాడుకిడ గోడల గీతలు గీసి లెక్కలన్
తెల్లము సేయు, చాకలిది తెచ్చిన బట్టలు, వైచుబట్టలున్
పల్లవపాణి త్రాడునకు బాగుగ వైచుచు, విప్పుముళ్ళ, దా
నల్లలి తంబుగా చదువ జాలని చిన్నియ లెల్ల మాధవా.

ఈమె యింకొక పద్యమున పేర్కొనిన దానిని బట్టి చూడ ఈమె సమకాలీను రాలు, వింజమూరి తిమ్మక్క అను నామె ద్విపదలో డోలా చరిత్రము అను కావ్యమును మిక్కిలి రసపుష్టిగ నొనర్చినట్లు తెలియుచున్నది. కాని ఈ కావ్య మగపడకున్నది.

ఆధ్యాత్మ రామాయణ ద్విపదను రచించిన, మామిడన్న సుభద్రమ్మ, పెక్కు నవలలు రచించిన గోపిసెట్టి లక్ష్మీనరసమ్మ శ్రీనివాసమ్మ, చిల్లరిగె రమణమ్మ, కృపాబాయి సత్యనాధమ్మ గార్లు చిరస్మరణీయు రాండ్రు. ఇందు కృపాబాయి సత్యనాధమ్మ అను నామె కలెక్టరు సత్యనాధనుగారి సతీమణి. ఈమె విద్యావతి అను నవలను రచించినది. ఈమె కుమార్తె పద్మినీసేన్ గుప్త గారు ప్రస్తుతము కలకత్తాలో నున్న సుప్రసిద్ధ రచయిత్రి.

వీరుకాక, 'లక్ష్మీస్వయంవరము' అను ఏకాంకికను రచయించిన గూడ పాటి లక్ష్మీనరసమ్మ, 'శ్యమంతకమణి నాటకము', 'రామేశ్వరయాత్రా చరిత్ర' మున్నగు కృతులను రచించిన గూడ అచ్చమాంబ, బోరగుడి సీతమ్మ, మీరా బాయి కావ్యకర్త్రి మొసలికంటి రామాబాయమ్మ, 'మృగశృంగ' కావ్యకర్త్రి చూడుకుడుత్తమ్మాళ్, భద్రాచలాధీశ్వర శతక కర్త్రి మోదవరపు లక్ష్మీ నరసమాంబ గార్లు కూడా ఇట సుస్మరణీయురాండ్రును.

## వెన్నెలగంటి హనుమాయమ్మ (1879)

ఈమె నెల్లూరుజిల్లా, కోవూరు తాలూకా యందలి వెలగపూడి సుందర రామయ్యగారి కుమార్తె. వెన్నెలగంటి నటేశన్‌గారి భార్య సంస్కృత భాషను ప్రౌఢముగ కవనము చెప్పిన విదుషీమణి.

విధిసంచితురాలై పుట్టినింట కాలము గడపుచు సోదరులు సంస్కృత విద్యాభ్యాసము చేయుచుండగా తానును ఆ విద్య నభ్యసించి సంస్కృతమున "పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ బ్రహ్మేంద్రస్వామి వారి పాదుకా పూజనమ్", కీర్తనల రూపముననున్న 'దత్తపూజా కదంబకమ్', శ్రీ జగద్గురు శంకర భగవత్పాదాచార్య పూజా విధిః 'శ్రీమచ్ఛంకర భగవత్పాద సహస్ర నామావళిః"—అను నీగ్రంథము లన్నియు నపూర్వములే. శ్రీ శంకర భగవత్పాదులకిట్లు సహస్ర నామావళి కూర్చినవారు ఇంతకు పూర్వము లేరు. ఆ భాగ్యమాంధ్రవనిత కామెకు దక్కినది. ఈ గ్రంథమున 329 అనుష్టుప్పులలో 1021 నామములు కలవు ఈ గ్రంథమునకు ఉత్తరాదిని బాగుగా వ్యాప్తికలదు. ఇవికాక మహాస్రగ్ధరా వృత్తమున పుష్పమాలికా బంధమున గాయత్రీ స్తవమొనర్చినది.

"హింసస్థాం సత్యసంధా, మజగజ నిగమాధార తారస్వరస్థాం
గాయత్రీం, యజ్ఞయాజ్ఞాం సురనరవరదాం పంకజాం కంబుకంఠీం
సావిత్రీం విద్య విద్యాం శ్రుతిమతిగతిదాం దేవసౌవర్ణవర్ణాం
వందేహం దేవదేవీం విమల మణిమయాంకుంద సౌందర్య దంతాం"

ఆమె రచనయంతయు ఇట్లే సౌందర్య ప్రభామండితముగా నుండును. ఇవికాక విశ్వామిత్ర ప్రోక్తమైన ఆధ్యాత్మరామాయణము నందలి శ్రీరామ భగవద్గీతలకు తెలుగున టీక వ్రాసిరి. ఈ యుగమున నింత ప్రతిభావంతముగ సంస్కృత రచనలు చేసిన వారీమెయే కాన్పించుచున్నారు. ఈమె రచనలు నేడు కాన్పింపవు. గృహలక్ష్మి యందలి విమర్శనయే యాధారము.

**సీరము సుభద్రయాంబగారు :**

జయపుర సంస్థాన కవిచంద్రులును, శతాధిక గ్రంథకర్తయునైన. సెట్టి లక్ష్మీనరసింహము గారి సోదరి యీమె !

సురుచీ విజయము, శిరోమణి యను నాటకములను, శ్రీ వేంకటేశ్వర, శ్రీరామ శతకములను, ఉత్తరరామచరిత్ర యను నిర్వచన కావ్యమును శుకజనక సంవాదము, ఆంజనేయ స్తోత్రాష్టాదశకము అను కావ్యములను, వివిధములైన వ్యాసములతోకూడిన వ్యాసగుచ్ఛమును, జాగిలము (ఆంగ్లానువాదము) అను నవలను రచించిరి.

ఇవికాక ఉత్తరావిలాపము, రుక్మిణీ సందేశము, గృహలక్ష్మి యను ఖండకావ్యములను రచించిరి- అన్నింటికంటె వీరి సుభద్రా రామాయణ రచన మిక్కిలి మనోజ్ఞమై ధారాశుద్ధితోకూడినదై, సరళమైయున్నది- స్త్రీలయందు ప్రప్రథమ నవలారచయిత్రి యీమెయే. ఈమె రచించిన సుభద్రారామాయణము మహాకావ్యము.

**అవధూత జ్ఞానమాంబ:**

తపస్వినియై, తత్త్వవేత్రియై, కవీశ్వరురాలై తనయునికిచే, మనికిచే నాంధ్రమాతను, నాంధ్ర భారతిని పావనమొనర్చిన పరమపూజ్యురాలు జ్ఞానమాంబ. ఈమె శేషమాంబా సుబ్బారాయల పుత్రి. బాల్యముననే, అక్షరాభ్యాసమైన కొన్ని దినములకే, అక్షరమాలయంతయు గ్రహించుటే కాక నాతిచిరముగ, ఈడుకుమించిన విద్యలునేర్చి పంద్రెండవయేటనే రంగావధూతగారి శిష్యురాలై బాల్యమున తలిదండ్రులొనర్చిన వివాహబంధమును రోసి, దుర్గమగిరిగహ్వరముల కేగి, తపమొనర్చి 'జ్ఞానమాంబ' యను నామధేయమున సుప్రసిద్ధురాలైన మహాభాగురాలీమె!

ఈ మహాయోగిని రచనలు. 'దేవుడు', 'విజ్ఞానామృతము', 'కళాప్రసాదిని', 'రంగావధూత', 'గార్గి', 'సత్ప్రభుశతకము' అనునవి. బొండుమల్లెల పేరులవలె, అదభ్రరుచి కిరవగు మౌక్తికమాలవలె స్వచ్ఛకాంతులతో అతి విశదమగు శైలితో, ఓజోవంతమగు గంభీరార్థములతో సుప్రసన్నముగ వెలుగు నీమెకృతులు లోకోత్తరములు, భవభయవిదారకములు, శ్రేయస్కారకలు.

దేవుడు అను కావ్యమునందలి 'దే'వు డెవరు? అను సంవాదము ఎల్లరు తప్పక చదువదగినది.

"అక్కరో! దేవుడెవ్వరు? అత డెక్కడుండు? అని ప్రశ్నింపబడి, ఆమె యిట్లు ప్రత్యుత్తరమిచ్చును-

"దేవుడెచ్చటో కల డదే త్రోవనేగి
దర్శనము చేయవలెనని తలచువారు
ఆకసమునెత్తిపై నున్నదనెడివారు
... ... ... ...

ప్రేమకేమైన రూపమ్ము పెట్టినామె!
ప్రేమనెఱుగని వారలీ పృథివిగలరె?
... ... ... ...
ప్రేమధామునిదేవు దర్శింపలేవె?"

కాశీప్రసాదినియందలి:-

ఏమార్గమునందు నిడిన
నీమార్గమునందెనడచి యది విడలేదా
నీమనసు నెఱిగి, నిర్మల
మౌ మార్గమునందె యుంచనగునో బాలా!

ఇట్టి పద్యములు, ఉపనిషదర్థ ప్రతిపాదకములై యున్నవి.

'చంద్రకళావిలాసము' అను ప్రబంధమును రచించిన శ్రీమతి కర్రా సుబ్బలక్ష్మమ్మ, 'గురుమౌళి' శతకమును రచించిన గ్రంధిమాణిక్యాంబ, గృహలక్ష్మియందు పెక్కు వ్యాసములను ప్రకటించిన, ఆచంట సత్యవతమ్మ, 'చంద్రమౌళి' యను గ్రంథమును 'చ ం ప క మా లి ని' యను నవలను రచించిన రాజాంబయు, వాజిపేయాజుల మహాలక్ష్మమ్మయు, 'ప్రబోధ'మను ఖండకావ్యకర్త్రి ఇనగంటి సరస్వతీదేవియు, 'భ క్తి ర సా మృ త ము', 'దివ్యక్షేత్ర సందర్శనము' అనురుచిమద్గ్రంథములను రచించిన సీమకుర్తి సత్యవతియు, 'విక్టోరియాక్రాసు' మున్నగు పెక్కులగు సుప్రసిద్ధ నవలలను రచించి ఆంగ్ల ప్రభుత్వకాలమున ప్రభుత్వ పారితోషకములందిన, పులవర్తి కమలావతీదేవియు, రాజశేఖర కవికృతమగు 'కర్పూరమంజరి' యను ప్రాకృత నాటకమును ఆంధ్రీకరించియు, పెక్కు ఖండకావ్యములను రచించియున్న రావూరి వెంకట సుబ్బమ్మ, 'భీష్మస్తవరాజము' మున్నగు గ్రంథములను రచించిన భువనగిరి లక్ష్మికాన్తమ్మ, 'జనార్దనశతక' కర్త్రి దొంతి రాజరత్నమ్మ, ఆంధ్రరాష్ట్రాస్థాన కవీశ్వరులును, శతాధిక గ్రంధకర్తయునగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి తనయ సంగ్రహభారత, భాగవత రామాయణాద్యనేక కావ్యకర్త్రి కల్లూరి విశాలాక్షమ్మ, సుప్రసిద్ధ కవయిత్రి మధురకవిశేఖరులు గొప్ప సంఘసంస్కారులు గౌతమీ గ్రంథనిలయ ప్రతిష్ఠాపకులైన నాళము కృష్ణరాయల ధర్మపత్ని నాళము సుశీలమ్మగారు ఇట స్మరణీయురాంద్రు-

## పులుగుర్త లక్ష్మీనరసమాంబ

స్త్రీల కుపయుక్తమగు ననేక రచనలు చేసిన విదుషీమణి: ఈమె చింతలపూడి అగ్గమాంబ, నీలాచలం పంతులుగార్ల కుమార్తె. మహా విద్వాంసు రాలైన కాశీభట్ల బ్రహ్మయ్యగారి శిష్య. వీరేశలింగంపంతులుగారి సంస్కారోద్యమమునకు వ్యతిరేకమైన సనాతన పక్షము.

విమర్శకాగ్రేసరులైన నడకుదుటి వీరరాజుపంతులుగా రీమెకు మేన మామ.

సావిత్రి అను పత్రికకు సంపాదకురాలై, ప్రథమ స్త్రీ పత్రికాసంపాదకు రాలుగా ఖ్యాతిగాంచినది. వామనపురాణమును వచనమున తెలుగుచేసిరి. స్త్రీల అభివృద్ధికై విద్యార్థినీ సమాజమనుపేర, కాకినాడలో నొక సమాజమును స్థాపించి సేవజేసిరి. వీరికి హిందీ, వంగభాషలయందుకూడా పాండిత్యము కలదు. ఆ భాషలనుండికూడ అనువాదముల నొనర్చి మంగళహారతుల శతకమును, కొన్ని నవలలు, పురాణకథలు, మహిళాకళాబోధిని అను కావ్యము, మున్నగు రచనలు వీరివి పెక్కులు కలవు.

## జూలూరి తులశమ్మగారు:

పద్మావతీవిజయము, సుమతీచరిత్ర, రాణీభవాని, మున్నగు పెక్కు కావ్యములను, గులేబకావళి అను నాటకమును పెక్కు వ్యాసములను వ్రాసిన విద్వత్కవయిత్రి.

ఈమె రాణీ చిన్నమాంబగారు పరంపరలోనివారి. ఆ రాణీగారి యాస్థాన కవయిత్రి.

వీరి గులేబకావళి నాటకము తెలుగునాట మిక్కిలిగా ప్రయోగ యోగ్యత నందినది.

## కవితావిశారద-కాంచనపల్లి కనకాంబగారు (1893)

బహు గ్రంథకర్త్రియు, గొప్ప విద్వాంసురాలుగాను, మద్రాసు క్వీన్ మేరీస్ కళాశాల ఆంధ్రోపన్యాసకురాలుగాను; ప్రభుత్వ విద్యాశాఖా సభ్యురాలుగాను గృహలక్ష్మి పత్రికా సంపాదకులైన శ్రీ కేసరిగారి స్వర్ణకంకణ గృహిణి యనై వెలసిన మహనీయురాలు. మహా మనిషియగు కనకాంబగారితో ఆంధ్ర

కవయిత్రీలోకమున నొక పరిణామశక మారంభమైనది. శ్రీయుతులు రాయప్రోలు సుబ్బారావుగారు మున్నగు కవివరుల నూతన కవితాపంథయు, జాతీయ భావ సంస్కారమును ఈ కాలమునుండి రచనలలో ప్రతిబింబించుట కాననగును. వెనుక పేర్కొనిన శ్రీమతి వులవర్తి కమలావతిగారుకూడా కేసరిగారి స్వర్ణ కంకణ స్వీకార మొనర్చినవారే. కాంచనపల్లి కనకాంబగారు "జీవయాత్ర", "అమృతానందబోధసారము", "ఆనందసారము" అను నాధ్యాత్మిక కావ్యములును, హంసవిజయము అను వేదాంత నాటకమును, శాకుంతలానువాద నాటకమును రచించిరి ఇవికాక వీరివి పెక్కు గద్య పద్యకృతులు గలవు.

దుర్గ్రహమగు వేదాన్త విషయములనైనను, సుగ్రహశైలిలో రమణీయముగ రచించుట వీరి ప్రత్యేక కవితాగుణము. దీనికి నిదర్శనముగ ఈ పద్యము గాంచుడు:-

"త్రిప్పిత్రిప్పిత్రిప్పి తిన్ననినిలుచేర్చు
గొడ్డువెంటనంటి గొల్లవాడు
త్రిప్పిత్రిప్పిజీవుదిద్ది ప్రోచునుగద
తత్పరుండు, హరి పరాత్పరుండు"

వీరు సంఘమును ప్రబోధించుపట్ల వ్యంగ్యధోరణితోడ సున్నితమును. గంభీరమును నగు హాస్యమును పోషించినారు. మిక్కిలి లౌకికానుభవపూర్ణములై, వినూతన శైలితో చక్కని పెక్కు గ్రంథములను రచించి మించుటయేగాక విజయవాడలో శ్రీ చుండూరి వెంకటరెడ్డిగారిచే నెలకొల్పబడిన త్రిలింగ విద్యాపీఠమున నాచార్యపర్యయై, యాజన్మాంతము ప్రతి సంవత్సరము పండితచర్చలు, పండిత సన్మానములు చేయించి విద్యాసేవ చేసి ధన్యతనొందిరి.

**గుడిపూడి ఇందుమతీదేవిగారు:**

అంబరీష విజయము, లక్షణాపరిణయము, తరుణీశతకము, రాజేశ్వరీ శతకము, నీతితారావళి, నరసింహశతకము, సోదరి గోవిలాపము, మున్నగుగా గల పెక్కు పద్యకావ్యములను, 'పద్మిని' యను నాటకమును గాంధీ కీర్తనలు, రామకథామంజరి అను గద్య గ్రంథములను రచించిన ఉత్తమ కవయిత్రి. ఈమె ఆంధ్రదేశమున సుప్రసిద్ధులైన మతుకుమల్లివారి యాడబడుచు, నలలిత శైలితోడు వీరి రచనలు హృదయాహ్లాదకరముగ నుండును.

సోదరి కావ్యమునందలి భావుకతా సహజతకు—

"ఒడినిబాలనుంచు నొయ్యనముద్దాడు
శిరముమూరుకొనుచు చేతనిమురు
కనుల నీరునించు గనుఁగొంటినిన్నాళ్ల
కమ్మ! నిన్నటంచు హర్షమొందు"

**కవిరాణి చిల్కపాటి సీతాంబ:**

"ఆజికిదప్పి శత్రువుల కౌదలలొగ్గితిరేని మేమికన్
గాజులనూడ్చి కత్తులను, కత్తడముల్గొని వైరిసేనలన్
తేజమడంచి యీ భరతదేశమునకున్నతిగూర్చి హైందవ
స్త్రీ జనశౌర్యమున్‌దెల్పి చేతులమోడ్వగ జేతుమిత్తఱిన్"

భారతమాతకు దాస్యవిముక్తి కల్గించుటకై, పూజ్య బాపూజీ నడపిన సత్యాగ్రహోద్యమ సందర్భమున శ్రీమతి సీతాంబగారు వ్రాసిన ప్రబోధ కావ్యము నందలి పద్యమిది!

వీరి రచనయంతయు నిట్లే దీప్తిమంతముగను, సరళ సుందరముగను ప్రకాశించుచుండును. 'పద్మినీపరిణయము' అను ప్రబంధమును, 'క్షీరసాగర మథనము' అను నాటకమును 'దిలీప', 'శూర్పణఖ' అను ఏకాంకికలను, 'అరవింద' యను నవలను రచించిరి కేసరిగారి స్వర్ణకంకణ గృహీతలలో వీరు ఒ గలరు.

నెల్లూరు మూలపేటయందలి సంస్కృత కళాశాలాచార్యులుగపని చేసిన శ్రీ చిలకపాటి వెంకటనరసింహాచార్యులవారి సతీమణి.

**శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు:**

ప్రసిద్ధ రచయిత్రి. ఆధుని కాంధ్రవాఙ్మయ యుగమున ననేక ప్రక్రియ లలో ననేక రచనలుచేసిన విదుషీమణి.

పాలపర్తి శేషయ్య హనుమాయమ్మల కొమరిత కీ॥ శే॥ కనుపర్తి హనుమంతరావుగారి సతీమణి.

కథానికా రచనమున పేనుమిగిలిన రచన వీరిది. గృహలక్ష్మి మున్నగు మాసపత్రికలలో సాంఘికమగు అవినీతి వృత్తములను విమర్శించుచు వీరు

'శారదలేఖలు' వ్రాసిరి. 'పద్మ' అను నాటకమును, ఆంధ్ర మహిళోద్యమముపై నొక బుఱ్ఱకథను, 'వసుమతి' యను నవలను 'లక్ష్మి' యను మకుటమున కొన్ని నీతిపద్యములను రచించిరి. వీరు నిరంతర రేడియో ప్రాసంగికురాలుగా నుండిరి. గృహలక్ష్మి సంపాదకులగు శ్రీ కేసరి వీరికే ప్రథమమున స్వర్ణకంకణమును బహూకరించియుండిరి. బాపట్లయందు 'స్త్రీ హితైషిణీమండలి' యను సంస్థను స్థాపించి సేవచేయుచున్నారు.

## ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ:

వీరును పొణకా కనకమ్మగారును జంటకవయిత్రులు నెల్లూరునందలి కస్తూరీదేవీ విద్యాలయమును శ్రీమతి కనకమ్మగారు స్థాపించి యందు బాలికలకు విద్యగఱపుచుండిరి. శ్రీమతి లక్ష్మీబాయమ్మగారును అచట కొన్నేండ్లు నివసించిరి. గాంధీజీ పిలుపు నందుకొని అసహాయోద్యమమున బహుధాశ్రమించిన నారీరత్నములు వీరు. శ్రీ రమణభగవానుని శిష్యురాండ్రై 'ఆరాధన', 'నైవేద్యము', 'జ్ఞాన నేత్రము' మున్నగు రమణభక్తిరసతుందిలములగు ననేక రచనలు చేయుటేకాక గీతానువాదమునుకూడ పొనరించియుండిరి. రసవత్తరమగు రచనాసౌమనస్యము ప్రసన్నరుచిరమగు శైలీవిన్యాసము వీరి రచనలలో కానవచ్చును.

ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు M. L. C. గా కొన్నేండ్లు ఆంధ్ర మాతను సేవించిరి. వీరిరువురును కీర్తికాయురాండ్రే.

"జగములు దన్నుతేజ స్సముద్రమ్ము
అడుగడ్గునకు క్రొత్తయందమ్ముదోప
తనివితీరని యమృతస్వరూపమ్ము
నిరతమ్ము మాలోన నివసించుగాక"

యని వీరు రమణ భగవానుని సంప్రార్థించియుండిరి.

## కవికలహంసి చేబ్రోలు సరస్వతీదేవిగారు:

'సరస్వతీ రామాయణ'మను బృహత్కావ్యమును రచించుటే కాక 'ఆత్మోపదేశము', 'శారదాశతకము' అను మేలికృతులను రచించిన కవయిత్రీ మణి,

ఈమె నూజివీడుపుర వాస్తవ్యులగు రాజగోపాలంరాయుడుగారి సతీమణి. చల్లగా, తియ్యగానుండు నిండైన కవిత్వధర్మముతో ఉత్తమకావ్యరచన చేసి ఆంధ్రభారతిని సేవించిన గేస్తురాలు। కేసరిగారు వీరికిని స్వర్ణకంకణమిడి సమ్మానించిరి.

## శ్రీమతి ఆత్మూరి అన్నపూర్ణమ్మగారు:

కుమార సుగుణబోధినీ శతకమను కొరడాతో కువ్యవసాయులగు దుష్టులను ఝుడిపించిన ధీరురాలు!

అన్నపూర్ణమ్మగారి మాతాపితృవంశములు రెండును విద్యా విజ్ఞానములతో ముందంజ వేసినవే. యజ్ఞమునొనర్చి, మహా సంస్కారభారములతో సంఘ సంస్కారసేవయొనర్చిన కీ॥ శే॥ ఆత్మూరి లక్ష్మీనరసింహంగారి కోడలీమె.

ఈమె తండ్రి కొల్లిపర శ్రీరాములుగారు. వీరు తహసీల్‌దారుగా పని చేసినవారు.

లోకమున స్త్రీలనుగూర్చి నీత్యుద్బోధము గావించువారు చాలా అధికము గదా। కుమారీ నీతిశతకాదు లెన్నో లోకమున బహుళముగ వ్యాపించియున్నవి. పురుషసంఘమునగల నిరంకుశాచారపరతను దిద్దుకొనుటకు పూనుకొనువారు మన సంఘమునకు అవసరముకదా? యను నొక ప్రశ్నకు వీరి కుమారశతకము ప్రత్యుత్తరము।

"పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
విచ్చలవిడి వేయునట్లు, విరివిగను కవుల్
హెచ్చుగ విద్యలనేరిచి
వచ్చిరె స్త్రీ నీతిగఱుప వసుధకుమారా."

"రుసరుసలాడుచు, దిట్టుచు
గసరుచుగోపింప, సతులు గ్రక్కునవశలై
మసలుదురని తలపోయుదు
రసురులవలె దుష్టపురుషులవని గుమారా"

ఈ విధముగ న్యాయసమ్మతమగు ప్రబోధమును దృష్టిలోనుంచుకొని, సంసారశకటము నీడ్చుటలో సరిసమాన బాధ్యతకల స్త్రీ పురుషులలో స్త్రీని నీతి

పేరిట అణంచుటకు అందఱును పెద్దలుగానే కన్పట్టుచున్నారు. కాని పురుష సంఘమునగల దురంతరములను బాపుకొనుట కేనాడు సంఘమున సరియగు ప్రయత్నము జరుగునో, ఆనాడే సంఘము బాగుపడునను భావమును మనసున నుంచుకొని వీరీ కావ్యమును వెలువరించిరి.

తరువాత సాహితీయుగధర్మము మారినను, పూర్వ ఛందోరీతులలోనే రచనను సాగించి కాంతాశతకాదులు రచించిన దేశిరాజు భారతీదేవిగారు. వీరును గృహలక్ష్మి కంకణగృహీత. పూలమాల, దేవుడు, దూతఘటోత్కచము, ప్రార్థన, దయ్యాలు, ఊర్మిళ, ప్రతిజ్ఞ (నాటకము), ఛాయ (నవల), వీల (కావ్యము),కాదంబిని(ఖండకృతుల సంపుటి), దేవీభాగవతము(సంస్కృతమునకు ఆంధ్రీకరణము) మున్నగు పద్య. గద్య, నాటక, ఖండకృతులను వెలయించి, ఆకాలమునాటి అద్యతనాంధ్ర మహిళా సాహితీయుగమునకు ప్రతినిధిగ నిలిచిన స్థానాపతి రుక్మిణమ్మగారు మిక్కిలి స్తవనీయురాలు፥ పొలివోని జీవరత్నముల భాతిభాసించు. చక్కని చిక్కని కావ్యకమలముల వెలయింపజేసిన స్థానాపతి రుక్మిణమ్మగారు కవిశేఖరులగు స్థానాపతి సత్యనారాయణగారి భార్య. వీరికిని శ్రీ కేసరిగారు గృహలక్ష్మి కంకణ మొసగియుండిరి.

'కవి'యను కావ్యమను, 'ఋతుగానము కళ్యాణగీతియను పేర స్త్రీ హృదయ గతమగు లలిత భావకోరకములను ముత్యాల సరములలో పుష్పింప జేసి దీప్తిమంతమగు రచనకు పేరువడసిన ఓలేటి నిత్యకళ్యాణమ్మగారు ఆనాట ప్రచురముగ గృహలక్ష్మి యందు తమ రచనలను ప్రచురించు చుండెడివారు.

సజీవమగు పదలాలిత్యము పొంగి పొరలుచుండగా కండకల భాషయు, పదునైన భావభంగిమయు తన రచనకు ఆకృతి దిద్దగా మాంచాల, సీతమ్మ పెండ్లి, వర్షర్తువు, పల్లెపదాలు మొదలైన ఓజఃపూర్ణ రచన, తన సొమ్మని చాటిన మదమంచి అనంతమ్మగారి కావ్యముల కానాటి సాహితీ జగత్తున మంచి స్థానముండెడిది.

"కారమ పూడికే, కదల మాంచాల
... ... ...
నీదు సౌఖ్యాంబుధి నీదులాడ, నన్ను
కనికరింపుము మిగుల కలికి మాంచాల"

అని నూతన కాముకతతో తన కాళ్ళబడిన, యువ వీరుని పతిదేవుని,

"మధుర జీవన మెంతమంది పోలేదు
షట్చక్రవర్తులు చావకున్నారె ?
... ... ...
పడతుల చేతిలోపల బొమ్మలైన
పలనాడు మీ చేత పాలితంబౌనె?"

అని ప్రబోధించిన మగువ మాంచాల మనసునకు అద్దము పట్టిన రచనో త్తేజము వీరిది !

పుట్టపర్తి కనకమ్మగారు సరస్వతీ పుత్రులైన పుట్టపర్తి నారాయణా చార్యుల ధర్మపత్ని-భర్త సారించిన 'అగ్నివీణ'లో ఈమెకును భాగస్వామ్య మున్నది. జాతి రథము, యశోధర, దుఃఖితసీత, జీర్ణ విజయనగరము మున్నగు పెక్కు ఖండకృతులను రచించిన సాహిత్యపురంధ్రి యీమె !

"అతడు బ్రహ్మర్షియని జగంబధిక భక్తి
బాడినది రస తంద్ర భావములం గూర్చి
వానికీర్తిఁ జింతానఖీ, వాడివత్త
లైన భవదీయ చరితమేమయ్యెనమ్మ ?"

యని దుఃఖితయైన యశోధరను పలకరించిన భావుకురాలీమె !

బుద్ధవరపు వారింటబుట్టి, బుఱ్ఱావారి యిల్లు మెట్టిన బుఱ్ఱా కమలాంబగారి హృదంతర్వర్తినియైన సరస్వతి, 'సుమమాల', 'భావలహరి' యను ఖండకావ్యము లలో తన సోయగములను జూచుకొని మురిసిపోవుచుండును. 'ఛందోహంసి'పై వాహ్యాళి వెడలుచు ఇంత చక్కనిబారువ మున్నదే ? యని యచ్చెరు వందు చుండును.

"...వరుసదప్పి యున్న నా విపంచి నొద్దిక నీ కడ
దెచ్చితి నరిజేయు దిట్టవనుచు."

నని సర్వేశ్వరుని కడ నకరుణముగ దురపిల్లిన అపర సరస్వతీ మూర్తియా, యీమె ! అనిపించు రచనలు వీరివి !

రామశతకము, బాలరామాయణము మున్నగు కావ్యములతో యువజగతి నుద్బోధింప యత్నించిన వారు; శ్రీమతి మాణిక్యం వేదవల్లి తాయారమ్మగారు.

సుప్రసిద్ధులైన ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు, న్యాయవాదులునైన చదలవాడ గోపీనాథంగారి కుమార్తె! కొవ్వూరునందు బాలికా సంస్కృత పాఠశాలను స్థాపించి గురుమణియైన, ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలాధ్యక్షిణి, బత్తుల కామాక్షమ్మగారి ఆదర్శమును పాటించిన తపస్విని యీమె!

ఇక నవ్యాంధ్ర కవితా సౌరభములను నలుగెలంకుల వాసింపజేసిన కవయిత్రీ సీమంతినులలో తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు, చావలి బంగారమ్మగారు, బసవరాజు రాజ్యలక్ష్మమ్మ కొత్తపల్లి లలితగార్లు సుప్రసిద్ధరాండ్రు కలరు.

ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగార్లతోను పారబ్ధమైన నవ్యాంధ్ర సారస్వత నందనమున అనేక రీతుల కవితాశాఖలు వెలసి ప్రబలుకొన్నవి.

ఈ కవితా పరిణామము శ్రీశ్రీ గారి గేయకవితతో పుష్టిచెంది పరాకాష్టను పొందినది. శ్రీశ్రీ గారి కవిత వచన గేయముగా బహుప్రశస్తినందినది. తరువాత రానురాను ఆధునిక యుగమున గేయయులు, వచన గేయములు, వచన కవితలే మిక్కిలి ప్రచారము నందున్నవి.

ఐనను నేటి కాలమునందుకూడా పూర్వ ఛందోయుక్తముగా కవిత్వము చెప్పు కవయిత్రులు అటనటలేక పోలేదు.

గుంటూరు నందలి మహిళా సంస్కృత కళాశాల యగు శారదా నికేతన సంస్థయందు ప్రధానాచార్యవర్యగా పనిచేయుచున్న సోదరి పిండిప్రోలు వసంత కుమారి అనేకపద్య కృతులు వెలయించిన ప్రాజ్ఞురాలు. స్నేహలత, వసంతాగమము మున్నగు పెక్కు కావ్యములను రచించిన కవయిత్రిగా తెలుగునాట వీరు ప్రశస్తిని పొందిరి.

ప్రసిద్ధ కవివరులైన శ్రీ నాయని సుబ్బారావుగారి తనయ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ శాఖయైన ఆంధ్ర రచయిత్రుల సంఘమునకు కార్యదర్శినిగా విశ్రుతి బడసిన సోదరి నాయని కృష్ణమాకుమారి గద్య పద్యరచనయందును, గేయరచన యందును విన్నాణము గడించిన ప్రసిద్ధ రచయిత్రి.

ఈమె తొలిరచన యనదగిన 'ఆంధ్రుల చరిత్రము' బాలవాఙ్మయశాఖలో మిక్కిలి ప్రశస్తి బడసినది. 'ప్రకాశరావు' మున్నగు పెక్కు కథానికలు వీరి రచన నైపుణ్యమునకు ప్రబలసాక్ష్యములు ప్రఖ్యాత రేడియో ప్రాసంగికురాలుగా, పద్య, గేయ రచయిత్రిగా వీరికి ఆంధ్ర రచయిత్రులలో విశిష్ట స్థానమున్నది.

మధుర కవి బిరుదాంచితులై. గౌతమీ గ్రంథనిలయ సత్ప్రతిష్ఠావకులైన నాళము కృష్ణరావు గారి తనయయై 'కృష్ణకుమారి' యను కలము పేరుతో బాల్యము నుండియు పెక్కు, గద్య, పద్య, వ్యాస, గేయ రచనలు చేసిన కవయిత్రి; ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ ఆంధ్ర కవయిత్రులు అఖిల భారత కవయిత్రులు అనునవి వీరి ప్రసిద్ధ రచనలు.

ఇవిగాక గీర్వాణ భాషయందు రచించిన 'శ్రీ కన్యకా సుప్రభాతము', 'దేవీ స్తవతారావళి','జాతిపిత యను కావ్యములు కలవు. హిందీ సంతకవులగు కబీరు, తులసీదాసు, బృంద, రహీముల దోహాలకు కొన్నిటికి తెలుగున పద్య ఖండములుగ అనువదించి, 'సదుక్తి మంజరి' యను పేరున ప్రచురించిరి.

అంతేకాక 'కన్యకమ్మనివాళి'యను గేయకావ్యము. కాంతి శిఖరాలు, చిన్నదివ్వె, 'లల్లమొల్ల' అను పెక్కు పద్య, గేయ కృతులు వీరివి అముద్రితములు కలవు.

'ఆంధ్రుల కీర్తన వాఙ్మయ సేవ' యను నొక బృహద్గ్రంథమును కూడ వీరు రచించిరి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ యందు వీరు విశిష్ట సభ్యురాలుగా నున్నారు. ఒకప్పుడు కేంద్ర సాహిత్య ఎకాడమీ, ఆంధ్ర యూనివర్శిటీ సెనేటులలో సభ్యురాలుగా నుండిరి. ప్రస్తుతము తెలుగు భాషా సమితియందు, విశ్వ హిందూ పరిషత్తులలో సభ్యురాలుగా నున్నారు.

అఖిల భారత రచయిత్రుల ప్రథమ సమావేశమును 1965 లో హైదరాబాదులో జరిపిన ఖ్యాతి వీరికే దక్కినది.

అప్పటినుండి సాహిత్య ఎకాడమీ శాఖయగు ఆంధ్ర రచయిత్రుల సలహా సంఘమునకు అధ్యక్షురాలుగా నుండి పెక్కులగు ఆంధ్ర రచయిత్రుల సమావేశములను జరిపించిరి.

1954 లో శ్రీ కేసరి గారి గృహలక్ష్మి కంకణమును వీరు పొంది యుండిరి. ఇంకను పెక్కు సేవా రంగములలో పనిచేయుచు, పెక్కులగు సాహిత్య సంస్థల ఎవార్డులను పొందియుండిరి.

భారత ప్రభుత్వమువారి విదేశ సాంస్కృతిక పర్యటనా కార్యక్రమము లలో 1972 ఆగస్టులో విదేశపర్యటన గావించి వచ్చిన ఆంధ్ర సరస్వతీ బిరు దాంచితురాలైన తొలి దక్షిణ భారత రచయిత్రి యీమె!

ఇట్లు పెక్కురు కవయిత్రులు శక్తిమంతములగు తమ రచనా పుష్పదాన ములచే ఆంధ్రసరస్వతి కలంకరించి ఆంధ్రసాహిత్యమును తేజోవంతమొనర్చి యుండుట మిక్కిలి ప్రశంసార్హమైన అంశము!

